శ్రీ లక్ష్మీచెన్న కేశవప్రసన్న.

# శ్రీ రాణీ సత్యవరలక్ష్మీ రామాయణము



శ్రీమద్విద్వద్గద్వాల సంస్థానాధీశ్వరులగు

## మహారాణీ ఆదిలక్ష్మీ దేవమ్మ బహద్దరుగారి

ఆజ్ఞానుసారముగా ముద్రితము.


గాడేపల్లి వీరరాఘవశాస్త్రి ప్రణీతము
గద్వాలాస్థానకవి. శతావధాని



శ్రీ చెన్నకేశవప్రెస్ గద్వాల.
1940



శ్రీ గద్వాల యువరాణీ
సత్యవరలక్ష్మీ దేవమ్మగారు

## (శ్రీ సామ్రాజ్యలక్ష్మీ ప్రశంస)



ఉ॥ శ్రీలలనానివాస సర ♦ సీరుహ ముజ్జ్వల భారతీ విలా
సాలస హంస భావముల ♦ కంబుజగర్భుని మోహనుదమ్మి భూ
పాల జయాంక భూతికగ ♦ జాధిప సౌధ సితాబ్జ మైన గ
ద్వాల నృపాల పాలన ప్రభు ♦ వంబుగ బెంపెసగున్ మహోజ్జ్వలై

## (శ్రీ మహారాజ్ఞి ప్రశంస)



సీ॥ మాను రామవిభుడు ♦ మరి ప్రాణనాథుడో?
ప్రభువు సీతారామ ♦ పార్థివుండు
మంత్రరాజంబు సు ♦ మా? రామనామంబు
వ్రాయించుకృతి పేటి ♦ రామకోటి
వ్రతమన శ్రీకృష్ణ ♦ రామ వ్రత విధాన
మన్వయావయపుత్రులై ♦ నదతడే
ప్రథిత సీతారామ ♦ భరత రామకుమారు
లంకృష్ణరామ రా ♦ డనుజమణులు

గీ॥ కనులుమూసిన తెఱచిన ♦ గానవచ్చు
రామతారక మేకృతి ♦ రత్నముగుచు
శ్రీ శ్రియఃపతి దయను మా ♦ కీర్తి వించె
నిది ధ్రువంబాదిలక్ష్మ్యంబ ♦ యెంత ధన్య॥

సీ॥ బిష్ట లల్లుండ్రతో ♦ కొట్టని కోటగ
హాషించు విక్టోరి యా విధాన
రాజ్యాంగమున వైరి ♦ రాజ్యాప హరణాన
నాఢ్య కాకతిరుద్ర ♦ మాంబ తెలుగు,
కవిగాయ కాగమ ♦ వివిధ సత్కృతులున
ర్షాశనంబు లిడ ల ♦ క్ష్మ్యంబ పొల్కి
చుట్టాల సురభియై ♦ సుజనా వనంబున
పెద్దలక్ష్మమ రాణి. ప్రేమ కీర్తి

గీ॥ పాకనాటి నృపాల ప్ర ♦ పాలనమున
ధీరదాతృత మేల్ బంతి ♦ దిద్దబెట్టి
కంకణము గట్టినాపు ని ♦ శ్శంక నేడు
లలిత గుణబింబ శ్రీ ఆది ♦ లక్ష్మమాంబ॥

(కృతి ప్రశంస)

సీ॥ విక్రమ భోజాది ♦ వివిధ పాలనలలో
సామ్రాజ్య రమ శిర ♦ స్థలిన వెలగి
కాకతీయాదుల ♦ ఘన పాలనములలో
ముద్రికాలాంఛన ♦ ముద్రలు ధరించి
కొండవీటి నృపాల ♦ కోటులా శ్రీ రెడ్డి
రాజుల సిరుల గా ♦ రవము లంది
శ్రీకృష్ణరాయ ని ♦ స్సీమ పాలనమున
నాందోళి కాదుల ♦ ననుభవించి

యున్న నిను సోమనాద్రి మ ♦ హోన్నతముగ
పాలన మొనర్చియున్నగ ♦ ద్వాలనృపతి
వంశమిది కృష్ణరామభూ ♦ పతి శశాంకు
సతము రక్షింపుమమ్మ స ♦ త్కృతి లతాంగి.

(కృతిసమర్పణము)



సత్యనారాయణ ♦ సద్వ్రతా చరణమే
కన్యోద్భవ ప్రధాన ♦ కారణంబా!
ఏ మాత జననంబు ♦ శ్రీ ప్రముష్టిపలిప్రభు
మణులకౌరసభాగ్య ♦ మహిమ వరమొ.
ఏ రామ మురువు సీ ♦ తారామ శ్రీయాది
లక్ష్మితపఃపుణ్య ♦ లభ్యఫలమొ,
ఏ మాన్య నవప్రేమ ♦ సోమ భూమీశ్వరో
త్సాహవృక్షమునకు ♦ దోహదంబా!.

ఏ మహాసాధ్వి గుణామణి ♦ నోముపంట
లవని పాలించు బురుషోత్త ♦ మాంశ కళలో,
అట్టి శ్రీ వరలక్ష్మ్యంబ ♦ యస్మదీయ
కృతిక ధీశ్వరి గద్వాల ♦ కేశవాజ్ఞ॥



(ఆశీర్వాదము)

సీ॥ శ్రీరామనామ ని ♦ స్సీమ ప్రభావమే
యెల్లర ప్రేమోల వర్ధిల్లుగాక
పఠన పారాయణా ♦ భ్యాసవశంబున
కృతి భక్తిరసము ♦ వర్షించుగాక
కృష్ణరామనృపాలు ♦ కృప సోదరాప్తుల
భూప్రజ నరశేక ♦ బ్రోచుగాక
సతతచిరాయుష్య ♦ సామ్రాజ్యసంతతి
వీరి కానాచిమై ♦ వెలయుగాక

గీ॥ ఆదిలక్ష్మి మహారాజ్ఞీ ♦ యతని
నధిక ధర్మాత్మ యగు చుబ్ర ♦ హ్మయ్య వంది
ముద్దుతనయుని పాలన ♦ దిద్దుగాక ♦
దివ్యకృతి కర్త కోర్కెసి ♦ ద్ధించుగాక॥

కం॥ పదు నెనిమిది వందల యెను ♦
వదియొక్కటి శాలివాహ ♦ వర్షప్రమాదిన్
బొదలిన శ్రావణ పూర్ణిమ
కిదిసంపూర్ణంబొనర్చి ♦ యిచ్చితి ప్రీతిన్

ఇట్లు,
విద్వద్విధేయుడు, సంతానశ్రేయోభిలాషి,
గాడేపల్లి వీరరాఘవశాస్త్రి; శతావధాని,
గద్వాలాస్థానకవి,

# పీఠిక

మహాశయులారా?

ఈ కృతి. సీతా కల్యాణము. శ్రీ సత్యవరలక్ష్మీ రామాయణమను పేర. శ్రీ గద్వాల మహారాజ్ఞీ దివ్యానుగ్రహమున. స్వర్గీయ శ్రీ యువరాజ్ఞీ సత్యవర లక్ష్మీ దేవమ్మ గారి కృతి ముగ నాచేత రచింపబడినది. దీని కధీశ్వరి. శ్రీ గద్వాల మహారాజులై. నా కవితాలతకాశ్రయానల్ప కల్ప భూజములై విశేషించి సకల విద్వత్కవి జనాభినవ భోజులైన శ్రీ సీతారామభూపాల్ బహాదర్ గారియొక్క ధర్మపత్ని శ్రీ శ్రీ శ్రీ మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మగారియొక్క బహుజన్మ తపఃఫలరూపమై శ్రీ సత్యనారాయణ వ్రత ప్రభావమున నుద్భవించిన ప్రథమ పుత్రీ రత్నము (శ్రీ గద్వాల్. దోమకొండ) ఉభయ విశ్వత్సంస్థాన భావి భాగ్యోదయుని ధానము శ్రీ. రాజా. దోమకొండ సోమేశ్వర రావు బహద్దరు గారి హృదయేశ్వరి, శ్రీ గద్వాల యువరాజుల గు శ్రీమంతు కృష్ణ రామభూపాల్ బహాదర్ గారి. జననీమణి యగుటవలన భక్తిరస ప్రాధాన్యముగా సునీతి దాయకముగ భగవత్ప్రేమ పాత్రముగ. నేనిందుబొందుక ఆచిన శ్రీరామజననాది సీతాకల్యాణాత్మకకథావిధానము సువర్ణ కంకణమునకు మణిగణాలంకారము వలె. రాజించినది. నిరుపమాన లావణ్యము, సనవద్య విద్యా నైపుణ్యము. పూర్వ పుణ్యమున నేకీభవించి సత్సాగర్భ శ్రీమాతముగ నుదయించుటకు దోడు! మాతృ గర్భమునుండి విద్వత్కవి జన మహాశీర్వాద సర్వంకష ప్రభావంబున దేజరిల్లి రుచిర గానకళాకేళిలలభారతియై పాతివ్రత్యమున నరుంధతియై యమ్మ

తనయ సంతాన సౌభాగ్యమున ననసూయయు బాల వెన్నెయు
నై. అభి జాత్యస్థాన కులశీల పౌరుష విజ్ఞానముల నతిలోక
విక్రమమున జగన్మాత యగు సీతయై. వీరపత్ని వీర మాతయు
న నేటి సతీమతల్లులలో నత్యున్నతస్థానమాక్రమించిన మత్కృతి
కన్యకామణిమూలమున నిండలి కావ్య గుణములు నంతటి తేజో
వంతము లై యనన్యసామాన్య గౌరవా స్పదములు కాగలవు ఆశ్రిత
బంధు చింతామణి యై వంశాభివృద్ధి కాశీర్వదించు పెద్దల
వాక్కుల సాఫల్య మొనరించు వరదాన రూప రాజ రత్నముల
నర్పించి సత్య వరలక్ష్మీనామము సార్థకపరచిన యీ సాధ్వీమ
ణి కంకితముగ నా కృతిరత్నమును సమర్పించుటవలన నా
కవితాకన్య ధన్యురాలు చిరకాలమునుండి విద్వద్గద్వాలపండిత
సభలలో నా కవిత రచనము గౌరవించుచున్న మహారాజ
దంపతుల ప్రేమపాత్రమైన వంశాభివృద్ధిమూలమైన. ప్రథమపు
త్రీమణి కాచంద్ర తారార్క యశశ్శరీ రాలంకరణమణి ప్రా
య ప్రబంధరాజ మర్పించిన నాభాషాయోష సేవయు శ్రే
యోదాయకమే. ప్రతిమారాధనములకంటె నప్రతిమారాధన
ములకెల్లవేళల నుపకరణములై శిథిలమెఱుగక ప్రత్యక్ష నీతి
విజ్ఞాన భక్తిరసభావోదయము లనుపదమునయ ముద్బోధించు
శబ్దశిల్పకళలె. కాలవాహినిలో విరాజిల్లు కృతి తతులని
గుర్తించి పతి. కృతి నిర్వహణ మిలాక్షరిపాల నమునకుదోడు
సమూలముగ దన భుజమూలమున నుంచు కొత్తింగిన మహాభాగ
కావున శ్రీమహారాణి విద్వద్రాజోభయ వంశాభివృద్ధికారణ
శరీరమైన యీ పుత్రీమణి కర్తృత్వమున శ్రీ కేశవాజ్ఞతో
సజీవ భావరస పేశల భక్తికథాసుధ లెసగించు నవియై యశ

శ్శరీరాలంకరణములై విజ్ఞానదృష్టి కన్ని కాలములలో వివిధ పవిత్రభావములు ద్రవింపజేయుచు రాణించు కావ్యములు సృష్టించు భాగ్యము నాకొదవించుటవలన నా వాగ్దేవత భక్తి రసభరితకృతి రత్నములతో భావప్రసూనములతో ననుపమాన రీతులతో శిక్షిత పేశల శయ్యల నెయ్యములతో వియ్యమందు శయ్యలతో సత్కృతి సమర్పణ మొనరించు భాగ్యము సిద్ధించి నది. రసవిదులు పాసించి చతుర్విధఫల పురుషార్థ సాధనముగ నుపయోగించు కావ్యకళ గూడ లోకసంగ్రహ ప్రయోజనము లవడినది, ఆబాల్య మింతవరకు నా నేర్చిన భాషావిజ్ఞాన కవితా ప్రబంధ రచనా వివిధావధాన నియమములలో విరచింపని ద్రాక్షపాక శైలితో నీకృతి నూతనముగ నేను సృజించి పాఠకలోకమునకొసంగుట బాలబాలికా పఠనలాభమునకనియె. నాయూహ, సనాతన విద్యావిధానము లోజ్జలకు సహితము గోచరాతీతములై. దుర్నిరీక్ష్యములై సుఖబోధలని ప్రాకులాడి నిస్తేజుల నోరుర్చు నవనాగరిక సంఖ్యా బాహుళ్య కాలమున తేలిక శైలితో సద్గ్రంథములలోని నీతివిజ్ఞానము లిప్పటి వర్ధమానుల కతివేగముగ నొసరించి యుపదేశింప దేశమాత. కవితనయులను ద్బోధించుచుండుట సన్నసన్నలవిని ప్రాజ్ఞాజ్ఞ మహా జనోపయోగ మర్థించి యీమార్గమునే శిరసావహించితి. శ్రీమదాది కావ్యరత్నమున. బాలకాండమును సీతాకళ్యాణము వరకీ సాధ్వీమణి పేరుతో. నుపయోగింపగల్గితి తక్కిన గ్రంథపూర్తి నిర్వహించుట, దైవసంకల్పము. శ్రీమహారాణిగారి యుత్సాహ యురారోగ్య భాగ్యములను నా భావనాశక్తిని, శ్రీ కేశవప్రభువు సత్యసంకల్పుడై ప్రోత్సహించిన- నదియు కరతలామల

కమె, సర్వతంత్ర స్వతంత్రుడైన యాపరాత్పరు మహిమ మాకట్టి ప్రోత్సాహమును ప్రసాదించుగాక. శ్రీకృతికర్త్రి సంతానమును వారిరాజ్యేందిరను వారిప్రజారక్షణ విద్యాగౌరవ రక్షణాక్షిణ కిరణముల ననంత కాల మభ్యుదయ మొనరించి సకాలవర్షములతో నాధివ్యాధుల రూపుమాపి సస్యాభివృద్ధులంతో లోకరంజన మేర్పరచుగాక. ప్రభుశక్తి ప్రజారంజనకళ లొండొంటికి దీసిపోవక పెంపెసగి యన్యోన్య ప్రేమాభిరామముతొ మెరుగెక్క శ్రీ మహారాణి గారియొక్క చి॥ శ్రీమంతయువరాజా కృష్ణరామ మహీపాల్ బహదర్ గారియొక్క పరిపాలన విధానము రామరాజ్యమని లోకాదర్శప్రాయముగుగాక కావ్యకళాభివృద్ధి గ్రంథాలయసమృద్ధినొనరింప నత్యుత్సాహముగల శ్రీమహారాణియభిమతము జయప్రదముగ నెరవేరుగాక సర్వ బాధ్యతలకు హిందూ సనాతనార్య ధర్మరక్షణము నకు నాధ్యత వహించిన శ్రీ మహారాణి సపరివారయుక్తముగ. వేదోక్త చిరాయు వైశ్వర్యముల నెనయుచుందును గాత, శ్రీ, శ్రీ, శ్రీ,

ఇట్లు

సంస్థాన శ్రేయోభిలాషి, భవదాస్థానకవి.

గాడేపల్లి, వీరరాఘవశాస్త్రి, శతావధాని.

హైస్కూల్ పండిత్





సహృదయులారా? తొలిపలుకులు

హృదయంగమమైన యీ మంగళ కృతిరత్నము శ్రీ సత్య
వరలక్ష్మి రామాయణమను పేరుతో శ్రీ గద్వాల మహారాణి
శ్రీ శ్రీ శ్రీ, ఆదిలక్ష్మీదేవమ్మగారి దివ్యాజ్ఞానుసారముగ నే
తదాస్థానకవి శిరోభూషణులై శతాష్టావధానాశు కవితో
భయభాషా సరస సాహితీ పరీక్షాధ్యక్షులై యనర్గళకృతి వి
రచనానిరవధిక విజయవాణీ పరిగృహీతపాణులైన బ్ర॥ శ్రీ॥
గాడేపల్లి వీరరాఘవశాస్త్రి శతావధానుల గారిచేత స్వర్గీయ
శ్రీ యువరాణీ సత్యవర లక్ష్మ్యంబకంకితముగ నొనరింపబడి
నది పరిష్కృత విద్వత్సభా నువత్సరోత్సవ సత్కారపూరిత దశ
దిశావలయ కరుణా వరుణాలయాంధ్రక్షత్ర రెడ్డి రాజాభినవ
భోజ శ్రీ గద్వాల్ సీతారామభూపాల్ బహద్దర్ మహారాజా
ద్వితీయ ద్వితీయ్యాప్రథమ పుత్రీమణి శ్రీ రాజా దోమకొండ
బహు పురాణాంధ్రీకరణ చణ క్షమానాథ వంశాభరణ
శ్రీ సోమేశ్వరధరారమణ ప్రియభార్యామణి శ్రీమంతు యువ
రాజా కృష్ణరామభూప మాతృక జనయిత్రీమణి ఆశ్రిత బాంధు
చింతామణి సకలసుగుణఖని భక్తిరసాశ్రయణిజనవాద్యనేక
విద్వత్కవి వివిధాశీర్వాద ప్రబోధిని సతీ లోకపావనియైన
శ్రీ సత్యవరలక్ష్మీదేవి యువరాణీతిలకమే తద్గ్రంథకర్త్రియై
ఆ. దుద్ధరణ తారక బ్రహ్మమయమైన శ్రీ మద్రామాయణ
శ్రీ రామజనన సీతాకల్యాణాది భక్తిరసాశ్రయ కథావిధా
నమై యుచితరసజ్ఞ కవ్యుపజ్ఞ ప్రతిభతో శ్రీ మహారాజాన్వ
యాభివృద్ధికాశీర్వదించుచు శ్రీ రామోదయమునకై మున్నె
దురు జూచుచు దరతరములనుండి సూర్యాన్వయ పురోహిత

త్వముసహిత మర్థించి కృతార్థుడైన వసిష్ఠునివలె శ్రీగద్వాల
యువరాజా చి॥ కృష్ణ రామోదయ దత్తస్వీకరణ పట్టాభిషే
కోత్సవావలోకన ధన్యతను గాంచిన కవిశిఖామణి రచించిన
వాడైనందుననిందలి విషయ వైలక్షణ్యము మిక్కిలి ప్రశంసా
ర్హము లోకశ్రేయస్సాధక మనుటకు సందియము లేదు.
బాలావృద్ధజనవద్య పద్య గద్యాశుప్రబంధ రచనా నిచయు
లైన యీకవియిట్టి విలక్షణ మహాకావ్యమునకు క్రొంగ్రొ
త్తగ ద్విపద శైలితో నభిరుచు లొదవించుటకు కారణము
నేటికాలవాహినిలో, నోనామాలకు గూడమోము త్రిప్పు పర
దేశవేష భాషానుకార నవనాగరక యువకకోటిలో లోకసా
ధారణ రామాయణ భారత భాగవతాదులలోని పద్యపఠ
నములు గూడ ననుభూతములై పెనుభూతములవలె పొడకట్టి
న చిత్తు దస్త్రాలకెక్కించి వాటిలేమి నేమిలెమ్మని నిజమరయక
నరయు భాగ్యమొదవిన ననజాలకీయుసిగ్గుని దేశ భాషాలా
లసులకు ప్రాణమైన నీతిదాయక గ్రంథ సంప్రదాయ బాంధవ్య
మే తరములు దెగినదాయాద్యమగుట శోచనీయమనియు విస
ర్జించిన నపకృతియనియు నేడాయుర్గ్రంథము వలెమృదుమధు
ర శైలితో బరగ సౌలభ్య ద్విపద కావ్యకళల సునీతిబోధకము
లుగ నేర్పు టవసరమని గుర్తెఱిగిన శ్రీరాజ్ఞిగారి యాజ్ఞాప్రకా
రమీ రామాయణ మహాకావ్య ధర్మముల ననుపమాన పద
గుంఫన ద్విపద కావ్యశిల్ప మమర్చినట్లు గోచరించుచున్నది
గంగాప్రవాహమువలెనేక సమాసఘటిత పరిష్కృత పద్యకల్ప
నావసరములలో నదురు బెదురెఱుగని వీరివేఖిని యీకావ్య
మున కేవలశిరీష పేశల మృదుమధుర శబ్దార్థాలంకార నియమ

ములతోనీద్విపదకావ్యరస పోషణమునసంతు లేని సుకుమా
త్రప్రసాదగాంభీర్యాది మర్యాద లనొదవించెనని ననాశ్చర్యర
మునొందని వారుండరు, పావనకథావిధానమున మూలానుకర
ణమవసరమైనను రసమునననుసరించి యనవసరములస్వాతంత్రిర
చి విసర్జించి యుచితస్థలముల రసౌచితినిబట్టి సంస్కృతనాటకం
ములలోని తళుకులందందు స్వకపోల కల్పితముగ సమర్థించి
కృతి రచననెంతయు ప్రశంసార్హముగ భక్తిబోధకముగ సునీ
తిదాయకముగ జిత్రించి సామాన్యులకుగూడ సంస్కృత నా
టక కళలలోని మెఱుగు లాంధ్రమునసే గోచరించి యానంద
పారవశ్యము నెసంగగల భాగ్యమును సమకూర్చిన యీకవి
మహోపకార మాంధ్రలోకమున కుత్సాహశక్తి దాయకమ
నకతప్పదు, ఇట్టి సుబోధక కావ్యములలో నుద్గ్రంథ సందోహ
ములనీతిని జొనిపి యనుపమాన ప్రాజ్ఞవిజ్ఞాన వాహిని పున
రుజ్జీవనదశకు తేదగిన కృతు లనేకము నొనర్ప బాధ్యతదాల్చిన
యీకవిని భాషాగ్రంథపోషణావసర మెఱిగి సర్వవిధముల
నుద్ధరించుచున్న శ్రీమద్గద్వాల విద్వత్సంస్థానాధీశ్వరులను
శ్రీకేశవప్రభువనంతాయురుపేతులుగ నెల్లవిధముల నభివృద్ధి
పఱచి లోకరంజన కావ్యకళాప్రపంచాభి వృద్ధికిదోడగుగాక.
శ్రీమహారాజ్ఞీమణి శ్రీయువరాజాభివృద్ధికితోడై పరిపాలనాం
శముల నిర్వహించుచు నాప్రేమపాత్రమైన యువరాణీ
చిత్తశాంతికొరకును జ్ఞాపకార్థమితోధిక భక్తిప్రేమరసకావ్య
ములనాసాధ్వి పేరుతో ప్రకటింపజేసియచిరమె శ్రీసత్యవర
లక్ష్మీగ్రంథాలయ మనియొక లైబ్రరీ. ముద్రణాలయములను
స్థాపింప జేయుటకు సత్య సంకల్పుడైన పరమేశ్వరు డనుగ్ర

హించిన రవేర్చుగాక ఈకృతి కృతికర్త్రీమణి కీర్తి నచంచలముగ నెలకొల్పి తత్సంతానానంత బంధు సందోహము నమందానందముగ నెసంగ బ్రసాదించుగాక. పండితకవినుణుల సదనుగ్రహమిట్టి కృతులపై యలరారుగాక జయము జయము

ఇట్లు
శ్రీమాన్ పుల్లగుమ్మి వెంకటాచార్యులు
గద్వాల సంస్థాన ధర్మాధికారులు వ్యాకరణాచార్యులు





(అభినందనాశీర్వాదపత్రిక)

క॥ కవికి కృతికి దీర్ఘాయువు
భవదప్రతిమాన కృషికి ♦ బ్రహ్మాయువు. శ్రీ
యువరాజ్ఞీ సంతాన
ప్రవిమల రాజ్యేందిరకును ♦ పరమాయువగున్!

ఉ॥ నాకడమున్న కావ్యపర ♦ సంపదనంతయొనర్చి నట్టిదే
యీకవి రాఘవుండు. నిజ ♦ హేల కవిత్వవిలాసినీ రసో
ద్రేక బహుప్రకారఫణి ♦ తిన్ దమసన్నిధి నిన్ని నాళ్లను
శ్లోకుల మేటి మున్నొసఁగి ♦ జూచుట నేడిట భూతలేశ్వరీ

ఉ॥ పన్నియుగన్న పండితుడు ♦ వర్తనమంచిది. వంశగౌరవ
బన్నిటికన్న మిన్నతమ ♦ యాదరణంబున నెని కావ్యముల్
సన్నుతిగూర్చ నొంచిపను ♦ శక్తి కొలంది రచించు పాటిడ
భ్యున్నతిగూర్చు కావ్యకళ ♦ లుర్వి పకోటికి లాతలేశ్వరీ

ఉ॥ రాముడు కృష్ణుడెన్న డెట ♦ రాజిలిరో? మఱివారి రాజ్యసు
శ్రీమహిమానుభావముల ♦ జెందినవృత్తములెట్టివో? కవి
గ్రామణులిట్లు పొత్తముల ♦ కారణకార్యశ్రీకాగ్రగణ్యులై
తాము లిఖించియుంటగద ♦ ధన్యత గణ్యత లోకదృష్టికిన్

ఉ॥ ఆ,యనినంతనే దయిన ♦ నాశువుతో బరిపూర్తి జేయుచున్
వ్రాయగలట్టిమీ సుకవి ♦ రాఘవశాస్త్రి లిఖించుచుండ రా
మాయణమేమి! భాగవత ♦ మ్మా మరి భారతమా యికేదియేన్
జేయుడటన్న, నీ శకము ♦ సిద్ధమొనర్చు నిలాతలేశ్వరీ

చ॥ నవనవ పద్యవృత్తములు ♦ నాణ్యముగా శతశోధికంబులు
త్సవముగ గూర్చు రాఘవుని. ధాటిని నేటి శకానుకూలమై
చవులొదవించు నీ ద్విపద ♦ సారసుధారసధారలూరగా

రవమున జేయ జేసితివి ♦ రాజ్ఞి?మనోజ్ఞమదెల్లభంగులన్

క॥ త్రిపథగ నడకలు నేడీ
ద్విపదలనలరించియద్వి ♦ తీయప్రతిభన్
విపులార్థంబుల నీతుల
ను పదేశమొసంగు కృతియి ♦ దుజ్వలఫణితిన్

ఉ॥ పాల్కురి సోమనాథ కవి ♦ పద్ధతి నుద్ధతిరంగనాథుక్రొం
దళ్కులు గౌరనార్యుని వి ♦ ధానము శ్రీకవిసార్వభౌము లో
కులకుబల్కునీల్గులందిరసి ♦ కుల్ముదము దగనిందిమిడ్చి ప్రా
బల్కగు రామతారకశు ♦ భప్రభ సత్కవి వ్రాసె నేర్పునన్

క॥ పువ్వుతావి నెసగుకైవడి ♦
కవికావ్యము, సత్యదేవ ♦ ఘనవరసిద్ధిన్
దవిలిన శ్రీవరలక్ష్మీ
భవ విదళననామమొదవి ♦ ప్రస్తుతికెక్కెన్

చ॥ సుమసమశబ్దతాండవము ♦ చొక్కు దయించగ జేయజాలు భా
వములసమానవృత్తులప్రబ ♦ వాహము వైస్ఫురియించు సద్రస
క్రమములసామరస్యములు ♦ కావ్యకళాసముపాస్యదేవదా
సుమహితసిద్ధిసాధ్యములు ♦ క్షోణితలేశ్వరిచిత్తగింపుమా

ఇట్లు, భవచ్ఛ్రేయోభిలాషి, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రులు

(అభినందన పత్రము)

మ॥ కమనీయాద్భుత భావసంపదల శృం ♦ గారాది నానారస
క్రమ విన్యాసములన్ ప్రబంధరచనా ♦ రంభంబులన్ గీర్తిక
గ్రిమమర్యాదనొసంగు సత్యవరల ♦ క్ష్మీపూజ్యరామాయ
త్రము కావ్యంబునుజూడగల్గితితదు ♦ త్సాహంబునన్ జొక్కితిన్

క॥ అల్లికలపేర్మి మల్లి

వల్లులతో మేలమాడు ♦ పదసౌష్ఠవమౌ
పుల్లార విందరసముల
వెల్లువ వెదజల్లు రచన ♦ విధమిదయారే

ఉ॥ తీయనిపల్కులన్ ద్రిపద ♦ తేలికశైలినదిద్ది కొన్నడల్
వేయతికించి కల్పనల ♦ లెక్కకును మిక్కిలిగా రసోన్నతిన్
ఛాయని రీతిజొన్పి,ప్రతి ♦ బాలకపాఠన లీలకెంతయున్
సాయమొనర్చు,నిట్టికృతి ♦ సర్వవిధంబులమేలొసంగెడున్

సీ॥ ఘటికాశతావధానే ♦ కగ్రంధనిర్మాత
ఘనుడు దేశికుడు.రా ♦ ఘవుడుసుకవి
పాపాపనోదన ♦ భవ్యరామాయణ
బాలకాండముకధా ♦ భాగరచన
ధరణీబిడౌజగ ♦ ద్వాలమహారాజ
సుతవరలక్ష్మాంబ ♦ కృతికికర్త్రి
రసవత్కవిత్వసా ♦ రస్యమెఱింగిన
గద్వాల్ మహారాజ్ఞి ♦ కార్యదక్షి

గీ॥ చూడనిటుగూర్చె కేశవ ♦ సూత్రధారి
ఆదికావ్యమువరలక్ష్మ ♦ మాంబపేర
తనరజేసెనిదాచంద్ర ♦ తారకంబు
సంచితార్థంబులొసగిరా ♦ ణించుగాత

గీ॥ నవయుధాశ్లోకరామాయ ♦ ణముకణాత
వంశశశిపెద్దనార్యుండు ♦ వ్రాసెని,చట
బాలకాండముసకలమా ♦ పయినసవ్యా
ఖ్యపదనికవిమర్శించి ♦ త్రించియుంచె

ఇట్లు, కాసలనాటి సుబ్బరావుశాస్త్రి కొలుకుల

క॥ శ్రీ మానిత వరలక్ష్మీ
గామాయణ సుకృతి వీర ♦ రాఘవకవిసు
త్రాముడు రచించె విద్వ
ద్భూమీశ్వర మణులుమెచ్చ ♦ బుధులరుదందన్

సీ॥ ఆంధ్రగీర్వాణ గ్రం ♦ థావళీరచనయం
దారి తేరినవాడు ♦ భూరియశుడు
సకలమహీపాల ♦ సంస్థాన సభలలో
సత్కృతుండైనాడు ♦ శాంతధనుడు
వేద వేదాంగాది ♦ విద్యాపరిజ్ఞాన
ప్రతిభాన్వితుఁడాఢ్య ♦ పండితుండు
సంతత చింతితా ♦ నంత రమాకాంతు
డాశీర్వచః ప్రదా ♦ నార్హమూర్తి

గీ॥ యగుచుగద్వాల విద్వజ్జ ♦ నాళిలోన
పద్యరచనకుమేటియై ♦ పరిఢవిల్లు
రాఘవకవీంద్రుఁడీ కృతి ♦ రత్నమిచ్చి
భక్తి చిత్రించె. యువరాజ్ఞి ♦ ప్రథితిమెఱయ

క॥ కృతి కర్త్రి ధన్య. ఘంటా
శతదివ్య శతావధాన ♦ సత్కవికృతి స
మ్మతి. సీతాకళ్యాణా ♦ కృతితోఁ ధరియించె.
గీర్తి ♦ కేవల మొక్కొ!

గీ॥ దుష్కవిగ్రంథ రచనాతి ♦ దోహలులగు
కవులువశవర్తులై యున్న ♦ కారణమున
నాదిలక్ష్మి మహారాజ్ఞి ♦ యాదికావ్య
ద్విపద సంకల్ప సుకృతిమా ♦ కీర్తి భవించె

సీ॥ అమలగంగా తరంగిణీ ♦ [illegible]ముగ
ప్రముద మొసగును నిమ్నోన్న ♦ తములు లేని
వీరికవిత కలంకార ♦ కారణమయి
యలరె శ్రీవరలక్ష్మాంబ ♦ కంకితముగ
గీ॥ బాలబాలికలకు గూడ ♦ జాలసులభ
శైలి పఠియింప ద్విపదగ ♦ సంతరించి
పావన గ్రంధమందలి ♦ బాలకాండ
కవియు నేర్పును ప్రకటింప ♦ గలిగెనిందు
సీ॥ నీతి దాయకగ్రంధముల్ ♦ నేర్పుకొలది
పఠన సౌలభ్య మీరీతి ♦ బడయజేసి
ప్రజల కుపయోగ మొనరింప ♦ భవమందు
దలచు శ్రీరాజ్ఞి మిక్కిలి ♦ ధన్యచరిత
క॥ జయమగుత కృతికి నుతికిన్
జయమగు గృతికర్త్రికింక ♦ సామ్రాజ్య రమా
శ్రేయప్రియ కోటికిలక్ష్మ
దయితుని దయ రాజ్ఞికొదవు ♦ తగ్గనిసిరులున్

ఇట్లు. జహాగీర్దార్
తోపు వెంకటాచార్యులు.
మేనేజరు. యస్. వి. యం ప్రెస్ గద్వాల్.



# అనుక్రమణిక

శ్రీ చెన్నకేశవ పరబ్రహ్మణే నమః

# శ్రీవరలక్ష్మీ రామాయణము

## ద్విపద

( 1 ) శ్రీకర రఘుకుల ♦ క్షీరాంబురాశి
రాకా సుధాంశుండు ♦ రాఘవేంద్రుండు

( 2 ) తారకబ్రహ్మంబు ♦ దశరథేశ్వరుని
కూరిమి పుత్రుడై ♦ కుమతుల జంప

( 3 ) తపసులనేల సి ♦ తారాములనగ
విపులజన్మించిన ♦ విశ్రుత చరిత

( 4 ) నాఱుకాండములు రా ♦ మాయణమ్మనుచు
కోరి వాల్మీకి చే ♦ కోసమున్న వ్రాసె

( 5 ) నారమ్యకథ పాప ♦ హారమాద్యమెల్ల
కోరికల్ గూర్ప పె ♦ ర్కొన్న కల్పకము

( 6 ) పుత్రప్రదంబు నై ♦ భోగసాధనము
శత్రుహరంబు య ♦ శస్కరంబనుచు

( 7 ) నారసి మది లోను ♦ లాదరు వినగ
ధారుణి బఠియింప ♦ దగిన యీద్విపద

(8) తేలిక శైలిన ♦ దెనుగున నేను
లాలితంబుగ వర ♦ లక్ష్మాంబ పేర

(9) విరచింప దలచితి ♦ విపులమౌ భక్తి
సరవి బఠించిన ♦ సంతానమొదవు

(10) వంశాభివృద్ధి సం ♦ పత్సర్వసిద్ధి
సంశయమే లేక ♦ సమకూర్చు దీన

(11) శ్రీలకు దగినకీ ♦ ర్తియు దఃలతూగు
కాలక్రమంబున ♦ గలుగును ముక్తి

(12) యాబాలగోపాల ♦ మతి సులభముగ
ధీజలాన పఠించు ♦ తీరున నెసగు

(13) కలిదోషముల నూడ్చి ♦ కాపాడు నెపుడు
నళినోదరుండాది ♦ నారాయణుండు

(14) రవిసుధాకరులు తా ♦ రకలుండు దాక
కవివర్ణ్యమీకృతి ♦ ఘనమయి వెలయు

(15) కృత్తికధీశ్వరి దివ్య ♦ కీర్తి నల్దెసల
నుతికెక్క జేసి భూ ♦ నుత తత్కుటుంబ

(16) సంతాన సామ్రాజ్య ♦ సతత వైభవము
కాంతిమంతంబుగ ♦ గాపాడు టొదవు

(17) చెన్నకేశవదయా స్థిరతర ప్రాజ్య
ప్రోన్నతరాజ్యంబు బొల్పొందుగాకఁ

(వైకుంఠము)

(18) శ్రీమదనంత ల ♦ క్ష్మీ విరాజితుడు
భూమాన్య చరితుండు ♦ భువనరక్షకుడు

(19) ఆదినారాయణుం ♦ డఖిలకారణుడు
నాదరూపుడు జగ ♦ న్నాటకధారి

(20) లోక కల్యాణుకడు ♦ లోకేశ్వరుండు
భూకామినీపతి ♦ పురుషోత్తముండు

(21) నీశ్వరుండాది గ ♦ ర్భైశ్వరీయుతుడు
శశ్వ దశేష త్రే ♦ జశ్శాలి శీలి

(22) భూరి చతుర్దశ ♦ భువన నిర్మాత
క్షీర పారావార ♦ స్థిరశయానుండు

(23) వటపత్రశాయి శ్రీ ♦ వత్సాంకధరుడు
నటనానుగుణుడు స ♦ నాతను డజుడు

(24) ఘన చతుర్బాహు డ ♦ ఖండ కోదండ
సునిశిత శస్త్రాస్త్ర ♦ శోభితమూర్తి

(25) వర శంఖచక్ర దీ ♦ వ్య గదాద్యఖిల
పరవిదారణ చణ ♦ పటుసాధనుండు

(26) దాసులకిల కల్ప ♦ తరువైనవాడు
నాసుపర్ణుని పైన ♦ యరిగెడివాడు

(27) వాసుకి సెజ్జపై ♦ బవళించు వాడు
దాసుల మొఱకు శ్రో ♦ త్రములుంచువాడు

(28) వేసరు టెన్నడో? ♦ వీడినవాడు
వాసవా ద్యమరుల ♦ పాలిటివాడు

(29) కూరిమితోడ వై ♦ కుంఠ పురాన
నారదాది మహర్షి ♦ నాథులతోడ

(30) ధీరులై కొలిచెడు ♦ దివిజులతోడ
పారిపార్శ్వకులైన ♦ భక్తులతోడ

(31) రమణీయగుణ సుధ ♦ ర్మా మధ్య భాగ
విమలచింతామణి ♦ వేదిక నడుమ

(32) వైనతేయుడు ముందు ♦ వత్తిలుచుండ
దీనార్తరవము లు ♦ ద్రేకించి వినుచు

(33) భూనభోంతరకథా ♦ బోధకపేటి
యేనిరోధము లేక ♦ యెదుట గదింప

(34) పరమభాగవతు లా ♦ పన్నులమనుచు
నిరుగెలంకుల సేవ ♦ లెసగించి చూడ

(35) శ్రీరమా రమణి కిం ♦ చిత్స్మేరదృష్టి
సారించి తన యుర ♦ స్థలి ముద్దుజూప

(36) కొలువులో సకల మూ ♦ కొనుచునీర్తి
బలుతెఱంగుల బ్రజ ♦ బాలించుచుండ

( భూభార ప్రకారణం )

(37) రావణ కుంభక ♦ ర్ణ ప్రముఖ్యులకు
చేవ వరంబులు ♦ జేజేలపెద్ద

(38) తపమునకెదమెచ్చి ♦ తానిడవచ్చి
కృపకోర్కెలడిగిన ♦ కేల్దోయిమోడ్చి

(39) చావెందులేని దు ♦ స్సహ వరా లడిగి
రావణు డావేళ ♦ రాజస మంది

(40) క్రోతుల నరులబే ♦ రొ్కనని విడచె
బ్రీతి దప్పక దద ♦ భీష్టంబు గూడె

(41) నిర్దేవతాత్వంబు ♦ నే నపేక్షింతు
దో ర్దర్పమిమ్మన ♦ దాడగి తమ్ముండు

(42) నిర్దేవ యనిర్దైవ ♦ నియతివాకొనిమె
సద్రక్షకై యటుల్ ♦ సమకూర్ప బ్రహ్మ

(43) తదనంతరమున నం ♦ తర్ధానమైన
మోదటివేల్పును మన ♦ మ్మున మెచ్చి కొల్చి

(44) దయ బ్రసాదించిన ♦ ద త్ప్రభావమున
భయమును వీడి దే ♦ వతల బాధింప

(45) రయమున నేతెంచు ♦ రాక్షసకోటి
జయజయ ధ్వనులకు ♦ జంకె తదీయ

(46) ధాటికోర్వగలేక ♦ దశకంఠు డపుడు
పాటవంబున గొన్న ♦ వరములు దలచి

(47) దివిజలోకంబులు ♦ దిక్పాల వితతి
దివివీడి యెందేగ ♦ దెఱువు గన్పడక

(48) సంగరంబులలోన ♦ సకలంబు నోడి
భంగంబు నొందుచు ♦ బ్రాణాలు వోక

(49) నమృతంబు ద్రావిన ♦ యట్టివారగుట
కమలాసనుని వ్రాత ♦ కడు చిత్రమనుచు

(50) చావన లేదాయె ♦ స్వర్గవాసులకు
జీవింప రాక్షస ♦ శ్రేణుల చేత

(51) బాధ దప్పనిదాయె ♦ పడరానిదాయె
సాధింతుమన శక్తి ♦ చాలకపోయె

(52) బ్రతుకనీయ్యరు వారు ♦ ప్రాణాలు పోవు
హింత మోట్టలనుచు నెం ♦ తె చింతమునిగి

(53) వరదర్పితారి రా ♦ వణ కుంభకర్ణ
గురుపరాక్రమముల ♦ గోరి యెదుర్ప

(54) భీకరమన్న శిక్ష ♦ పేశలమయ్యె
గద దండపాణి య ♦ ఖర్వదండంబు

(55) పదనేగి పూదండ ♦ పగిది వర్తించె
నెమరు దిక్పాలుల ♦ హేలాస్త్రవితతి

(56) దానవ భర్తల ♦ దఱుమంగ లేక
మానంబులుడిగి శ్ర ♦ మంబులు దక్కి

(57) మేరుకందరముల ♦ మేనులుడాచి
కారియపడి పెద్ద ♦ కాలంబు గడుప

(58) దశకంఠు డద్భుత ♦ దర్పమే పార
దిశలెల్లగెల్చి మే ♦ దిని హవిర్భాగ

(59) భోజనంబులు గూడ ♦ బొత్తుగమాన్పి
తేజంబులుడిపిన ♦ దివిజ వర్గంబు

(60) వైరి జయంబు యే ♦ వరుసనగాక
వాదించుటన స్వప్న ♦ వార్తగా దోచి

(దేవతలు బ్రహ్మాపాలికరుగుట)

(61) సత్యలోకంబున ♦ శారదాభర్త
శ్రోత్యంత పఠన సం ♦ స్తుత్యవాఙ్మయుల

(62) సనక సనందన ♦ సన నారదాది
ఘనసన్నిధానమై ♦ గాయత్రి మేధ

(63) సావిత్రి పరిసర ♦ స్థానపీఠముల
పావనాకృతులతో ♦ భాసిల్లుచుండ

(64) శారదనిజముఖ ♦ సదనమై శ్రవణ
సారస్య మొదవించు ♦ సామగానముల

(65) వీణియనోంకార ♦ విశ్రుతశ్రుతికి
వాణియంబుగ గంఠ ♦ నాదంబు జొనుప

(66) కొమరొప్పగను బ్రహ్మ ♦ కొలువున్న వేళ
నమరవరేణ్యులా ♦ యదనుగణించి

(67) తమతమ బన్నముల్ ♦ ధాతతో వినుచ
ప్రమదంబుతో వచ్చి ♦ పలికి రీ రీతి

## (బ్రహ్మ స్తోత్రము)



(68) భారతీవల్లభ ♦ బహుపరాకయ్య
వారిజోద్భవ! యిదే ♦ స్వాగతమయ్య

(69) జోహారు గోవింద ♦ సుత శతానంద
మాహితంబెదజూడు ♦ మా! చిదానంద

(70) అని పాదముల బడి ♦ యభయ శుభంబు
వినిపింప లేకున్న ♦ విబుధ నాయకుల

(71) భయకారణ మెఱింగి ♦ పద్మోద్భవుండు
దయజూపి తనపాణి ♦ తలముల నెత్తి

(72) సురనాథులార? యి ♦ చ్చో వెఱ పేల
సరని మేషంబోర్చు ♦ డవని పీడించు

(73) రావణాది సమస్త ♦ రాక్షసాధములు
బోవ నుపాయంబు ♦ బుద్ధినూహింతు

(74) ననుపంకజానను ♦ హర్షాదరోక్తి
వినిసేద దేఱుచు ♦ విబుధు లిట్లనిరి

(75) దుష్టాసురుల సృష్టి ♦ తోయజ జాత
స్రష్టవై తొలుదొల్త ♦ సాగింపనేల?

(76) పొరపాటుతో నాయె ♦ పో? నుష్టసృష్టి
స్థిరమతి వారికి ♦ దీర్ఘాయువేల?

(77) అదియు నేదో యిచ్చు ♦ ట వసర మైన
పదపడి దుష్కర ♦ వరము లివేల

(78) పలికవీవు నీ ♦ యిష్టాప్తి సృష్టి
మాలోన పెద్దవు ♦ మఱి జేయుదనిన

(79) కడ కనాలోచన ♦ కార్యజాలముల
నడచు గూర్చితివి మ ♦ హాభాగ? దేవ

(80) దీని కేదే నుపా ♦ దేశం బొసంగి
మానంబునిల్పిన ♦ మఱి లేపా! మాపా!

(81) వీరితాతలజేసి ♦ వేధించు పనిని
పారసోద్భవ నీవు ♦ సాగించు చుందు

(82) వవని జేసెదు చేతు ♦ లాగటకలదె
శివశివా; నీసృష్టి ♦ స్థితి యిటులయ్యె

(83) తవిలిన దివ్యవే ♦ ధ శ్శబ్దతత్వ
వివర మియ్యది యొకో? ♦ వినువుదయించె

(84) నవసృష్టిలోన యీ ♦ నాటక మిూవు
దివిజుల పెనుచావు ♦ తీరునారయక

(85) సాగించి దేవతా ♦ సదనాలకార్తి
బాగొప్పసమకూర్చు ♦ పద్ధతి నీది

(86) సమయము మనిచూడ ♦ జావు లేదాయె
విమతుల బాధలా! ♦ విడువనివాయె

(87) చావక నానాట ♦ జాల్ముల బాధ
దేవుడా యని హరి ♦ దేవనమంది

(88) కటకటా! యెల్లర ♦ కాళ్ళొత్తవలసె
కుటిల రాక్షసులతో ♦ గోడాడవలసె

(89) యెటుజూచినను దరి ♦ యించుటకల్ల
దిటవెట్టులనికుందు ♦ దివిజుల జూచి

(90) కనుసన్న భారతీ ♦ కాంతను జూడ
వనజోద్భవుని చతు ♦ ర్వదనంబులందు

(91) నాదరూపంబుగ ♦ నైపుణి దోప
సాదర మొప్పగ ♦ శారద బలికె

(92) జేజేల దొరలార ♦ చిత్తవిభ్రాంతి
రాజీవభవునేల ♦ రా పాడు టిటుల

(93) దైవతంత్రము దేహ ♦ ధారులకెందు
త్రోవ గన్పడనీక ♦ తొట్రుపాటిచ్చు

(94) కారణ మొదవక ♦ కార్యంబు భువిని
గోరంత బొడమదు ♦ కోరిక వినుడు

(95) శివునాజ్ఞ లేకయే ♦ చీమయు గఱువ
దవనిలోననుమాట ♦ లాలింప రొకో ?

(96) సర్వకారణమైన ♦ సర్వమయుండు
నిర్వాహకుం డెది ♦ నియమించు నదియె.

(97) ఋగ్యజుస్సామాది ♦ యోగ్య వేదముల
దృగ్యథార్థార్థంబు ♦ దీపించుదాని

(98) చట్టంబులో నున్న ♦ సకలంబు నెఱిగి
చట్టంబు వరుస తూ ♦ చా దప్పకుండ

(99) నడపించు పుణ్యుండు ♦ నాభీ భవుండు
జడిమతో నిల్లైల ♦ సత్యేతరముల

(100) పలికెద రజాడైన ♦ పద్మోద్భవునకు
దిలకించు డెల్లరు ♦ దేవతలార

(101) చూపట్టు జగతిలో ♦ జుట్టాలు గలరె
లోపంబు లనుచు నా ♦ లోకేశు నేల?

(102) పలికెద రనునంత ♦ భక్తిని దాల్చి
నళినసంభవు సుర ♦ నాయకుల్ దేర్చ

(103) వారి సన్నుతులకు ♦ వాంఛితార్థంబు
ధీరతతో బ్రసా ♦ దింపంగ దలచి

(104) లోక కంటక దైత్య ♦ లోకనాయకుల
ఢాక కోర్వగలేక ♦ డగ్గరి నన్ను

(105) పలికిన పలుకులు ♦ భక్తిరసంబె
వెలయించె దీనికి ♦ వెరచుట లేల?

(106) నను గన్నతండ్రి యా ♦ నారాయణుండు
మన బాధ లడగింప ♦ మార్గదర్శకుడు

(107) పోయి వేడుదమని ♦ భూరిరయాన
రాయంచ నెక్కి పు ♦ రందర ప్రముఖ

(108) దేవతా గణము ల ♦ ర్థించుచు గొలువ
వేవేగ వైకుంఠు ♦ పేరోలగమున

(109) తుంబురు నారదా ♦ దులు వేడి పాడ
సంబరంబున ముని ♦ శార్దూలు లుండ

(110) శ్రీరమారమణితో ♦ చిర్నగవొప్ప
ధీరత దేవాది ♦ దేవుడై యున్న

(111) నారాయణుని జూచి ♦ నాళీకభవుడు
చేరి యిట్లని నుతి ♦ జేయ దొడంగె

(బ్రహ్మదేవతలతో నారాయణు నుతించుట)



(112) ఆర్తార్తి హారణ ది ♦ వ్యత్కృపాభరణా
కీర్తిత చరణ స ♦ త్కృత లోకశరణా

(113) దివిజలోకాధార ♦ దీన మందార
నవ జలదాకార ♦ నవ్య శరీర

(114) పరమ పావనగాత్ర ♦ పద్మా కళత్ర
నరసన్నుత స్తోత్ర ♦ నవ్య చరిత్ర

(115) గజరాజ సంత్రాణ ♦ కమనీయ బాణ
రజనీచర ప్రాణ ♦ గ్రకచ కృపాణ

(116) విద్యానవద్య శ్రీ ♦ వేదాంతవేద్య
యద్యతనా భేద్య ♦ నారిహాయ హృద్య

(117) రక్షింపవే? నిట ♦ లాక్ష సంసేవ్య
మాక్షేమ మీక్షించి ♦ మమ్ముద్ధరించు

(118) దలపూను మా? దాస ♦ దాసుల మనిన
నళినోదరుం డాది ♦ నారాయణుండు

(119) కరుణా రసంబులు ♦ కన్నుల దొలుక
సుర సంఘముల నెల్ల ♦ జూచి యిట్లనియె

(120) పరమేష్ఠిముఖ సుర ♦ వర్గంబులార
మెఱుగుదు మీరాక ♦ కేమి కారణమొ?

(121) ఎదురు జూచుచు నుంటి ♦ నేగుదెంచితిరి
ముదముమీరగ సర్వ ♦ మునుబల్క వచ్చి

(122) నిలచినమాత్రాన ♦ నే గ్రహించితిని
బొలియింతు దశకంఠు ♦ బుత్రులతోడ

(123) దుర్భర వరములం ♦ దుటచేత నసురు
నిర్భాగ్యవృత్తిక్షో ♦ ణికి భారమయ్యె

(124) సాగిరావాట లా ♦ జాతికిమీద
భాగవతోత్తమ ♦ కథ మేర్పఱింతు

(125) ప్రతి తృణంబును వారి ♦ ప్రాణముల్ దీయ
నతి సమర్థములుగ ♦ నవని గల్పింతు

(126) భూదేవతార్తుల బోకార్చు పసికి
పాదు కొల్పితిని యు ♦ పాయంబు వినుడు

(127) వరకాల మఱిగె దు ♦ ర్భర శరాహతిన
పిరికితనంబేల? ♦ పీచ మడంతు.

(128) దనుజుల దలల గ్ర ♦ ద్దల పాలొనర్చి
మనుతు నింకొకక్షణ ♦ మాత్రంబులోన

(129) దశరథేశ్వరుడు సం ♦ తానార్థి యగుచు
సశపథంబుగను కౌ ♦ సల్యాది సతుల

(130) దీక్షకాయతపెట్టి ♦ ధీరతతోడ
నక్షయ భక్తితో ♦ నారాధనముల

(131) నలరించి కులగురు ♦ వైన వశిష్ఠు
బిలిపించి తదనుజ్ఞ ప్రియమున దాల్చి

(132) హేలతో బుత్రకా ♦ మేష్టి యజ్ఞంబు
తాలిమి సాగించె ♦ దశరథేశ్వరుడు

(133) సు తపస్వియగు వసి ♦ ష్ఠుని యరుంధతిని
తత విభాండకముని ♦ తనయుడై యున్న

(134) జటి ఋశ్యశృంగు శ ♦ శ్వద్బ్రహ్మచర్య
పటుతర శ్రీ తుంగ ♦ భద్రాజలౌఘు

(135) తట ధారుణీవాసు ♦ తాపసోల్లాసు
స్ఫుట తపశ్శాంతులై ♦ చూపట్టు మునుల

(136) నకలంక పద్ధతి ♦ నర్థించి చేర్చి
సకల మాయతపెట్టి ♦ శాస్త్రపద్ధతిగ

(137) పావన గంగా ప్ర ♦ పాతాతిపూత
కేవల ఖ్యాత సా ♦ కేతంబులోన

(138) బహుయజ్ఞశాలలే ♦ ర్పఱచి త్రేతాగ్ని
సహిత వేదికలలో ♦ శ్రౌత గానముల

(139) నల ఋష్యశృంగ బ్ర ♦ హ్మత్వమం దుంచి
లలి యధ్వరస్థాన ♦ లక్షణ కలితు

(140) గురు వసిష్ఠుని హోమ ♦ గుండాగ్నిప్రకర్ష
పొరపాటు లేకుండ ♦ బొసగింప నిల్పి

(141) ప్రేషల దేవతా ♦ ప్రీతు లొనర్ప
భాషించు హోతల ♦ ప్రస్తోతృ జనుల

(142) నాగ్నీధ్ర ముఖ్యుల ♦ నందందమర్చి
అగ్నిముఖంబుగా ♦ నాహుతులిచ్చు

(143) సమయంబు దాకొనె ♦ జాగ నర్హంబు
క్రమ మేర్పఱచి వ ♦ క్కాణింతు వినుడు

(144) పావనుండైనట్టి ♦ పంక్తి రథుండు
దేవి కౌసల్య యా ♦ దీక్షతో నన్ను

(145) వేవేగ గనుటకై ♦ పెక్కు వరాలు
భావపూరితముగ ♦ వడసి యున్నారు

(146) తడయక నే నవ ♦ తారంబు గొనుచు
పుడమి మానుషరూప ♦ మును దాల్చువాడ

(147) భూసుతాయుధయులు ♦ బొల్పొందు సెజ్జ
మానక వత్తురు ♦ మా దేవి గూడ

(148) తనకార్య ఖడ్గంబు ♦ బా గొని చనియె
మనములయందను ♦ మానంబు దక్కి

(149) మీరు వానరములై ♦ మించు భల్లూక
వారంబులై భువి ♦ వర్తింపు డిదిగో

(150) అలసింపక యేగు ♦ డనిన వారెల్ల
చాల నానందించి ♦ జని రంద రెలమి

(151) నారాయణుడు యజ్ఞ ♦ నారాయణాంశ
సారెకిచ్చిన హవి ♦ స్సంతతి వొక్కి

(152) సామ గానములతో ♦ సంతోషమిచ్చు
శ్రీమదుద్గాతల ♦ చెలువున కలరి

(153) ఘనుడు వశిష్ఠుండు ♦ గార్హ్య పత్యాగ్ని
ప్రణయించి యధ్వర ♦ పాత్రలో హావ్య

(154) మవదాన మొనరించి ♦ యా శ్రావయాది
రవమున నాగ్నీధ్రు ♦ రక్షణ మొంది

(155) యల్ల మైత్రావరు ♦ ణానుమోదమున
నుల్లాసమున హోత ♦ యొసగు నసుజ్ఞ

(156) నెల్ల కర్తవ్యంశ ♦ మెల్ల సూచించు
సల్లలితాగమ ♦ స్వరము లాలించి

(యజ్ఞనారాయణుండుమూర్తిభవించుట)



(157) వౌష డటంచు గ ♦ వ్యము వ్రేల్చునంత
మేషాధిరూఢుడై ♦ మిఱుమిట్లు గొలుప

(158) నాలుగు శృంగముల్ ♦ నయమొప్ప మూడు
కాళ్ళులు నిరు తలల్ ♦ కరములు నేడు

(159) చెలువు మీఱిన సప్త ♦ జిహ్వలు దాల్చి
లలి ధూమ్రపాటలా ♦ లంకారవర్ణ

(160) సలలిత స్తుత్యతులతో ♦ ఛందఃప్రయుక్త
విలసితా కృతులతో ♦ వేడుక గొలువ

(161) నయబోధియై యజ్ఞ ♦ నారాయణుండు
ప్రయతించి తద్గార్హ ♦ పత్యాగ్నిలోన

(162) నభయహస్తంబుతో ♦ నాగాగు మరుచు
ప్రభవమై పాయస ♦ పాత్రంబు బట్టి

(163) దశరథ? దివ్య సం ♦ తానంబు నీకు
విశదంబుగా గల్గు ♦ వేవేగ దీని

(164) గొని పాయసము నీవు ♦ కూరిమి సతుల
కనుపొంద జెందింపు ♦ మది యారగించి

(165) దివ్య పూరుషుల ధా ♦ త్రీభార వసుధప
భవ్యకీర్తుల గని ♦ ప్రబలింతు వనుచు

(166) తను దానె మరియు నం ♦ తర్హితుండైన
మునులు నృపాలు డ ♦ మోఘ యజ్ఞమున

(167) ధ్యానగమ్యు మహాన ♦ తరణ రూపంబు
మానక ధ్యానించి ♦ మఱి క్రతు పూర్తిఁ

(168) గనజేయజేసి భూ ♦ కాంతుండు భక్తి
గొని పాయసపు పాత్ర ♦ కూరిమి మునుల

(169) యానతి నడిగి ది ♦ వ్యాశీస్సు లంది
పూనిక శుభ లగ్న ♦ మును నిరీక్షించి

(170) కుల దేవతల కెల్ల ♦ కోరిక మ్రొక్కి
ఫల పుష్ప తాంబూల ♦ బహు సపర్యలను

(171) భక్తి సమర్పించె ♦ ప్రజలెల్ల రపుడు
శక్తిమై రాజును ♦ సంస్తుతి జేయు

( పాయసమిచ్చుట )



(172) దశరథుం డానంద ♦ తత్పరు డగుచు
శశిముఖి యైన కౌ ♦ సల్యను బిలిచి

(173) దైవ వశంబున ♦ దనుజ విఘ్నములు
రావయ్యె పాయస ♦ గ్రహణంబు గూడ

(174) పట్టంపు దేవి వీ ♦ పాయసాన్నంబు
బట్టు మటంచర్ధ ♦ భాగ మందించె

(175) ప్రియము రెట్టించిన ♦ పినభార్య కైక
కయి తక్కు సగమిచ్చె ♦ యారాజమౌళి

(176) ప్రభువు మధ్యమ భార్య ♦ పడతి సుమిత్ర
మభయ మధ్యస్థగ ♦ నుంచు చేర్పడియె

(177) మధ్యము డెందును ♦ మధ్యముం డనుట
తథ్యంబుగా జేసె ♦ దశరథేశ్వరుడు

(178) నిరువదియొకసారి ♦ యీ భార్గవునకు
వెఱచి పెండ్లాడిన ♦ విధి దీక్షగొన్న

(179) వనజాక్షు లింకను ♦ ప్రభునకు గలరు
కనలుచునున్న ద ♦ త్కాంతలలోన

(180) మును వివాహితలు యీ ♦ మువ్వురందునను
మనసు కెక్కిన ధన్య ♦ మాన్య సుమిత్ర

(181) నడుమవారెంనున ♦ నామకరూ లనెడు
నుడి జపింపగనైన ♦ న్యూనత నెఱిగి

(182) కౌసల్యకైకల ♦ కరములు బట్టి
కౌసంత యని పతి ♦ కరుణ ప్రార్థించె

(183) మేలెంచి వారు సు ♦ మిత్ర కిర్వురను
పాలించు కించుక ♦ భక్తి నర్పింప

(184) నారాజు మిక్కిలి ♦ హర్షించి వారి
యోరిమి కాత్మలో ♦ నొందె నచ్చెరువు

(185) ముగుదలా మువ్వురు ♦ మోదంబు బొదల
తగమెచ్చి యది మొదల్ ♦ దగ్గని ప్రేమ

(186) తోఁబుట్టువుల వలె ♦ తోషంబు దాల్చి
ప్రాబల్య సామ్రాజ్య ♦ పదవి పెంపెక్క

(187) పాయసాన్నము దిని ♦ పరమేశు భక్తి
బాయక వర్తిల్లి ♦ పరమ సౌఖ్యముల

(188) పతి హిత వృత్తితో ♦ బరితుష్టి నుండ
కుతుకంబు లభివృద్ధి ♦ గోరిక బెంప



## (రాజపత్నులు గర్భములు దాల్చుట)



(189) రాజపత్నులకు గ ♦ ర్భము లంకురించె
తేజంబుతోనున్న ♦ త్రేతాగ్నులందు

(190) రాజిల్లు వైశ్వాన ♦ ర ప్రభలనగ
పూజనీయ్యంబైన ♦ పురుషోత్తమాంశ

(191) నెలనెల కంతట ♦ నెలతల కెంత
విలసిల్లె గర్భిణీ ♦ వివిధ చిహ్నములు

(192) భోజనంబుల మీఁది ♦ బుద్ధి నాదారె
సాజంబుగను పవల్ సమకూఁరె నిద్ర

(193) ఓకరింతలు హెచ్చె ♦ నొడలు తెల్పెక్క
వాకిండ్ల నరుగుల ♦ వసియించు టొదవె

(194) చవిచెడి నాల్క స్వ ♦ చ్ఛము దప్పి మన్ను
నెవతెఱుంగక భుజి ♦ యించు కోర్పడిమె

(195) నేలతే పరుపులై ♦ నియమంబు విడచి
కేలుదిండుగ బండు ♦ కోలులు బలిసె

(196) చెయి నేలనాని నె ♦ చ్చెలులకే లూని
వయసు లజ్జను మాని ♦ వర్తింపనయ్యె

(197) భీతి వైదొలగ నే ♦ పెద్దల జూడ
ప్రీతి పుట్టిండ్లపై ♦ ప్రియపడ సాగ

(198) కన్నులు బరువాయె ♦ కపురంపు విడెము
లన్నిటికన్న రు ♦ చ్యముగ గన్పట్టె

(199) గర్భ చిహ్నము లిట్లు ♦ కాల క్రమమున
దుర్భర ప్రక్రియ ♦ దోచినవేళ

(200) సన్నపు నడుము హె ♦ చ్చను పనిబూనె
సన్నుతాంగములు కృ ♦ శత్వంబు దాల్చె

(201) నవనీశ పత్నుల ♦ కతి హర్ష మొదవ
నవ మాసములు నిండి ♦ నయమతి నుండ

(202) చైత్ర శుద్ధంబున ♦ జనములు వొగడ
పాత్రత నవమి శు ♦ భ ప్రభ లలర

(203) గ్రహ పంచకోచ్చ క ♦ ర్కటక లగ్నమున
రహియించు శ్రీ పున ♦ ర్వసు తారయందు

(శ్రీరామ జననము)



(204) సకల లక్షణముల ♦ సన్నుతి గనిన
యకలంక శుభ సమ ♦ యంబున నొత్త

(205) కౌసల్య ! శ్రీరాము ♦ ఘన కృపోద్దాము
నా సనకాది వం ♦ ద్య ప్రభా ధాము

(206) నాదిలక్ష్మి తల్పి ♦ తా శేషకాము
మేదినీ రత్నణా ♦ మిత్ర విరాము

(207) ప్రసవించె ప్రాగ్దిక ♦ బర్వ శశాంకు
నసమానముగ గని ♦ నట్టుల వేగ

(208) సర్వ సుపర్వుల ♦ సౌభాగ్య మనగ
గీర్వాణ రిపు ధూమ ♦ కేతువో? యనగ

(209) సుర దుందుభులు మ్రోగె సుమవృష్టి గురిసె
మురి పెంపు గోవులు ♦ ముప్పూట బితికె

(210) చిరుత క్రేపులకెల్ల ♦ క్షీర ధారలను
పరిమళ వాయువుల్ ♦ బయులా క్రమించె

(211) ధరణి శ్రీపతి యవ ♦ తార మావేళ
కరమరి కోటికు ♦ లా_పాత మయ్యె

(212) నదిజూచి రావణా ♦ ద్యసుర గణంబు
లదరి నవ్వుల మన ♦ మాడిన వెల్ల

(213) మొదటి వాక్యంబులై ♦ మూర్తీభవించె
పదపడి యింకేమి ♦ ప్రాప్తింపగలదో?

(214) జన్నంబు జెరుపగా ♦ జనుడన్న ముసలి
కన్నన్న? సుతులట? ♦ హాస్యాస్పదంబు

(215) వీక్షింతమంటి ర ♦ స్వీక్షింపు డింక
రాక్షసాగ్రణులార? ♦ రామోదయంబు

(216) జరిగిన దికనైన ♦ జాగ్రత యనుచు
పరమ సాధనముల బరగింపుడనుచు

(217) దహ తహ జెందుచు ♦ దాటకా ద్యసుర
లహామహా మిక తోడ ♦ నడవుల మెలగ

(218) శీర్షోదయము మాకు జెప్పు డటంచు
పార్షోదయముగ గృ ♦ హ ద్వార వేది

(219) జాతకంబులు జూచు ♦ జ్యోతిష్క గణము
సూతికాభరణముల్ ♦ శుద్ధంబు లనుచు

(220) జేతదాల్చిన భిష ♦ క్సీమంతి నులును
చేత సిద్ధక్రియల్ జెలగుచు నుండ

(221) భూతి మాంత్రిక మహా ♦ భూతవైద్యులును
స్వాతంత్ర్య తంత్రముల్ ♦ చతురిమ గూర్ప

(222) గారమండలు వేప ♦ కమ్మ చివుళ్ళు
నేరుపు మీర సం ♦ ధించి నద్దెసల

(223) మహిమ గాపాడెడు ♦ మంత్రసానులును
తహతహతోడ నెం ♦ తయు విలోకింప

(224) నృపతి యిటంపు స ♦ న్నిధి భటావళులు
విపుల మాయాక్రాంత ♦ వివశులై యున్న

(225) దైవచిత్రంబని ♦ తలచి బ్రహ్మాది
దేవతాగణములు ♦ దివ్య మానులును

(226) శ్రీ రమాధవుడు వేం ♦ చేసిన దివ్య
చారుమంగళ లగ్న సం ♦ లగ్నమూర్తి

(227) కనులార గని నుతుల్ ♦ గావింప దలచి
జనుదెంచిచూడ నా ♦ జాను బాహుండు

(228) ఘన కిరీటుండును ♦ కనక కుండలుడు
తనుభృత శస్త్రాస్త్ర ♦ శౌరేయమూర్తి

(229) శతకోటి మార్తాండ సదృశ తేజస్వి
ప్రతిలేని బింబమై ♦ ప్రత్యక్షమైన

(230) వైకుంఠు కరిరాజ ♦ వరదుని భక్తి
సాకల్యముగ జూచి సరసిజాసనుడు

(231) సుస్తుతుల్ సురలు త ♦ థా స్తనుచుండ
విస్తృత ప్రేమతో ♦ వినిపించె నిట్లు

(బ్రహ్మ శ్రీ విష్ణుస్తుతి నొనరించుట)

(232) యజ్ఞ? యజ్ఞేశ్వర? యజ్ఞైక నిలయ
యజ్ఞేశ్వరార్చిత ♦ యాజ్ఞవవరాహ

(233) సత్య దీక్షాదక్ష ♦ సజ్జన రక్ష
దైత్యేంద్ర ప్రతిపక్ష ♦ ధర్మైక దీక్ష

(234) కుక్షిస్థ భువన వై ♦ కుంతాగ్ర భవన
పక్షిరాడ్గమన వి ♦ పన్నైక శరణ

(235) వేదస్వరూప వా ♦ గ్విమలా నులాప
నాదబిందు కళాభి ♦ నంద్య కలాప

(236) శ్రీరామ? రఘురామ? శృంగార రామ
ధారితాఖిల కామ? ♦ దశరథరామ

(237) సీతా మనఃకామ? శ్రీవత్సదామ
వాతాత్మభవ భక్తి ♦ వర్ధన ప్రేమ

(238) ఘోరాసుర విరామ? ♦ కోదండరామ
ధారాధర శ్యామ ♦ తారకనామ

(239) దశకంఠ దమన వే ♦ ద పథైక గమన
పశుపతి స్తవన వి ♦ నస్వ దాభరణ

(240) కమనీయగుణ భద్ర ♦ కరుణా సముద్ర
స్తిమితావనీముద్ర ♦ శ్రీ రామభద్ర

(241) రక్షమాం, రక్షమాం, ♦ రక్ష సంరక్ష
రక్షింపవే నిట ♦ లాక్ష సదృక్ష?

(242) లీలావతార ని ♦ లింప సంత్రాణ
పాలింపవే వార్ధి భంజనబాణ

(243) దాసదాసులము, నీ దరిజేరినాము
గాసి పోకార్చుచు ♦ కాపాడుమయ్యా

(244) అని పల్కు చతురాన ♦ నానన స్తుతుల
విని తేఱిచూచి శ్రీ విష్ణు విట్లనియె

(245) లోకనాయకులార? ♦ లోకేశ నుతులు
సాకల్యముగ వింటి ♦ సత్యంబు వినుడు

(246) భూభారమైయున్న ♦ భువన కంటకుల
ప్రాభవంబు లడంప ♦ ప్రభవించినాడ

(247) నలశంఖచక్రంబు ♦ లాదిశేషుండు
లలిబుట్టుచుండు రి ♦ లాగున న్గొలువ

(248) తొలత వరంబులం ♦ దున గోరదట్టి
ఖలుద్రుంప భల్లూక ♦ కపిగణమగుచు

(249) మీరెల్ల బుట్టుడు ♦ మేదినిమీద
నా రావణుని గూల్తు ♦ నంబరగూడి

(250) యాలస్య మింకేల ♦ నన దేవతాళి
కేలుమోడ్పు లొసంగి ♦ కేవలభక్తి

(251) ఈమ తమ కన వైన ♦ తావులలోన
క్షమ జనియింపగ ♦ జని రెల్లవారు

(252) విశ్వరూపుడు చంటి ♦ బిడ్డడై మఱల
విశ్వాస మొసగింప ♦ వేడుక వెలగ

(253) కావుకావుమటన్న ♦ కలలోక ములనూ
బ్రోవగం జాలిన ♦ పురుషోత్తముండు

(254) కావుకావుమటంచు ♦ కన్నులం దెఱచి
పావనస్వరమున ♦ బట్టె పెఱగ్రుక్క

(255) శిరవి ప్రసూతికా ♦ గృహము లోనున్న
పరిజనంబులు లేచి ♦ బాలుస జూచి

(256) రాజీవదళనేత్రు రఘువీరపుత్రు
భూజన నుతపాత్రు ♦ భువన పవిత్రు

(257) నిబిడ రాక్షస దుర్వ ♦ నీ వీతి హోత్రు
ప్రబలపాతకహార ♦ భవ్యచరిత్రు

(258) భవబాధ బంధుర ♦ వల్లీ లవిత్రు
కువలయదళనీల ♦ కోమలగాత్రు

(259) ముదమొప్పగను జూచి ♦ ముగుదలు తాము
కొదవేమి ఫలియించె ♦ కోరికెలనుచు

(260) ఆనందమున దేలి ♦ యమ్మరో నేడు
భూనాథునకుగల్గె ♦ పురుషసింహుండు

(261) మనయదృష్ట మిదంచు ♦ మంత్రసానులును
జననాథసుతు నెత్తి ♦ సవరించి మంచి

(262) గోర్వెచ్చ నీటితో ♦ గొబ్బున గడిగి
పర్వేందుముఖులు తీ ♦ వ్రముగ శిరంబు

(263) తల్లొత్తి గదియించి ♦ తత్తనాభినఖర
సల్లలితస్థాన సం ♦ శోధనములు

(264) సాగించి పొత్తిళ్ళ ♦ సత్వరముంచి
యూఁగరాని ముదంబు ♦ లాత్మదళ్లొత్త

(265) చతురతా పెదమంత్ర ♦ సానులు గూడి
బ్రతిమాలి కౌసల్య ♦ భయకంపములను

(266) తొలగించి నీసు ము ♦ ద్దుల తనూజుండు
విలపించు నిదెం లెమ్మ్మ ♦ వేగిరమనుచు

(267) ఫలియించె నీనోము ♦ పతికోర్కెలనుచు
చెలి? యికాలస్యంబు ♦ జేయబోకనుచు

(268) వలిపెంపు సీర్గావి ♦ వలువ గట్టించి
తిలకించి వేవేగ ♦ తీర్థమాడించి

(269) తడులొత్తి పయ్యంట ♦ దలకొంగుగట్టి
పిడిచుట్టుగా జీర ♦ బిగియించి చుట్టి

(270) ధూపముల్వెలయించి ♦ దోషఘ్నమైన
సూపచారంబు లా ♦ యువిదలొనర్ప

(271) సన్నిధి భృత్యులా ♦ సార్వభౌమునకు
చిన్ని బాలుడు బుట్టె ♦ సేమంబటన్న

(272) వీనుల విందుగా ♦ వించు నామాట
మానసాంబుజమున ♦ మమత రెట్టింప

(273) నేడుగా నాజన్మ ♦ నిఖిల లోకముల
పోడిమి సర్వ సంపూజ్యమై వెలసె

(274) నేడుగా నాప్రజ ♦ నిఖిల రాజ్యంబు
క్రీతమై జగముల ♦ కీర్తి నార్జించె

(275) వని భూమిపాలుండు ♦ హర్షవారాశి
మనమున నుప్పొంగి ♦ మగ్నుడైయంత

(276) సందేశహారులకు ♦ సత్కృతులిచ్చి
వందిమాగధులకు ♦ పండితతతికి

(277) మందిరంబుననున్న ♦ మనుజులకెల్ల
సుందరమణి గజ క్షోణి గో కనక

(278) మందిరారామాది ♦ మహనీయ దాన
బృందంబు లర్పించి ♦ యెల్లర కచట

(279) చక్కెర పొట్లముల్ ♦ సరవి నిప్పించి
యక్కర కైదీల ♦ నందర వదలి

(280) గురువు వసిష్ఠుని ♦ కోరి రప్పించి
శిర మొగ్గి మ్రొక్కి ని ♦ శ్చిత భక్తిఁ గూడి

(281) ప్రసవగృహంబులో ♦ బాలుని జూచి
ముసిముసి నగవుల ♦ మోమును వాంచి

(282) కస్తూరివిడియంబు ♦ కసటువో నమలి
దస్తుగా పిడిచుట్టు ♦ తలఁగ్రొంగు వెలయ

(283) పచ్చి బాలింతయై ♦ పానుపుడిగ్గు
సచ్చరిత్ర నట కౌ ♦ సల్యను జూచి

(284) ముచ్చటపడి జగ ♦ న్మోహనాకారు
నుచ్చైః స్వరాలంపు ♦ నూకొని చూచి

(285) జాతకర్మాదులు ♦ క్షత్రియాచార
రీతి నిర్వర్తించి ♦ ప్రియ గురు నాజ్ఞ

(286) భూరిదానంబు ల ♦ ద్భుత దక్షిణాలను
కోరి పాత్రులకెల్ల ♦ కూర్మినొసంగి

(287) ధారాళముగవచ్చి ♦ దశరథ ధశ్వరుడు
పరివారిని గౌర ♦ వించెడు వేళ

(288) ప్రజకేలి కొదవె య్యా ♦ బాలుడే మనకు
భజనార్హుడనుచు భూ ♦ ప్రజలను చుండ

(289) కూరిమి కేకయు ♦ కూతురు కైక
నారాయణుని హస్త ♦ నాళీక లగ్న

(290) మైయున్న పాంచజ ♦ న్యాంశంబుతోడ
సోయగంబునమించు ♦ సుందరాకారు

(291) భరతవిఖ్యాతితో ♦ భాసిల్లువాని
మురిపెంబుతో మీన ♦ మున రమణీయు

(292) పుష్యమి తారలో ♦ బాలుపొంద గనిమె
తిష్యశిష్యాళి న ♦ ర్తించుచు బొగడ

(293) రెండు భాగములలో ♦ రెండు ఖండములు
పండువుగా యజ్ఞ ♦ పాయస మంది

(294) యూరగించినసుమి ♦ త్రాంబగర్భమున
తూరుపుదెస రవి ♦ దోతెంచుచుండ

(295) గణుతికెక్కఁదగు క ♦ ర్కట లగ్నమందు
ఫణితారన సహస్ర ♦ ఫణి సహస్రార

(296) ప్రణుతాంశములతోడ ♦ భాస్వంతులగుచు
గుణి లక్ష్మణుడు రిపు ♦ ఘ్నుండును గల్గి

(297) రమర వైరులగుండె లవిసిపో జేయ
నమిత తేజస్వులై ♦ యన్నను గొల్వ

(298) సర్వలక్షణముల ♦ జనియించినట్టి
యుర్వీశసుతుల కిం ♦ దుచిత పద్ధతిగ

(299) జాతకర్మక్రియా ♦ చారముల్ మఱియు
నాతత పుణ్యాహ ♦ మా నామకరణ

(300) మనఘులు గావించి ♦ రందు శ్రీరామ
ఘననామమిచ్చి ర ♦ గ్రజునకు ప్రీతి

(301) భరత లక్ష్మణ శత్రు ♦ పటలఘ్నులనుచు
చిరుతవారికి పేర్లు ♦ చిత్రించి రెలమి



## (శ్రీరామనామప్రభావము)



(302) నామనిర్ణయమహా ♦ నందప్రశంస
రామనామార్థ సా ♦ రస్యంబు సభకు

(303) సుజ్యేష్ఠుడగు వసి ♦ ష్ఠుం డిట్లు దెలిపె
పూజ్యనామంబిది ♦ భువనత్రయమున

(304) సకలయోగులచిత్త ♦ సరసీరుహముల
ప్రకటితక్రీడల ♦ రమియించుగాన

(305) రామతారకమని ♦ రాజిల్లె దీని
ప్రాముఖ్యమెంతని ♦ ప్రస్తుతించెదను

(306) రామతారక పద ♦ ర్థము నిర్ధరింప
నేమనుజునకగు ♦ నిదమిత్థ మనుచు

(307) రామతారకమను ♦ రమ్యనామంబు
భూమిని శివ విష్ణు ♦ పూర్ణమంత్రంబు

(308) రా యనుదాని నా ♦ రాయణనుండి
మా యనుటో? యొన్న ♦ మశ్శివనుండి

(309) సారభూతంబుల ♦ జర్చించి చేర్చ
నీరుచిరాకృతి ♦ యేర్పడగల్గె

(310) రా షోవ నాయన ♦ రహిమ వర్ణంబు
లోపింప నశివమై ♦ లోకంబు నేచు

(311) వందున మంత్రసా ♦ రాంశభూతములౌ
సందేహమే లేదు ♦ జప్యంబులన్యొ

(312) నందున నీరేఫ ♦ మడచు పాపముల
బెందీప్తితో నగ్ని ♦ బీజంబుగాన

(313) షోయిన పాపమె ♦ ప్పుడు జొచ్చకుండ
మాయక్షరముతల్పు ♦ మార్గంబు మూయు

(314) తారకమా చంద్ర ♦ తారకధ్యేయ
మీరామనామం ♦ చెరుగంగవలయు

(315) కోరి పార్వతికి వా ♦ కొను విశ్వనాథు
డీ రామ నామార్థ ♦ హేలరేల్ బవల

(316) నది కారణంబుగ ♦ నా వారణాసి
త్రిదివాధికంబు ధా ♦ త్రీ చక్రమందు

(317) జంతువులందు షం ♦ చక్రోశ మధ్య
నంతరించెడు వేళ ♦ నభవు డర్ధాంగి

(318) కుడిచెవి తారక ♦ కోవిద మంత్ర
మొడసేయ కుపదేశ ♦ మిచ్చుచు నుండు

(319) కేజంతువైన నం ♦ దేగెడు వేళ
నోజతో కుడిచెవి ♦ నందుపై కెత్తి

(320) అవిముక్తనిలయ పు ♦ ణ్య క్షేత్రమహిమ
దవితె శ్రీరామమం ♦ త్రము తారకమున

(321) నది సదాశివుని ది ♦ వ్యాజ్ఞయటంచు
నదుపాస్యమని వేద ♦ సంహితబలుకు

(322) సకల వేదములలో ♦ సారాంశభూత
మకళంకతారక ♦ మద్వయం బిదియె

(323) ఓంకారమందు ముం ♦ దుదయమై సకల
శంకారహిత వేద ♦ శాస్త్రార్థగోళ

(324) సంకలితంబగు ♦ శబ్దంబు పోల్కి
నంకురితబ్రహ్మ ♦ కాద్యమై వెలయు

(325) రామనామ వరాక్ష ♦ ర శ్రేణి క్షోణి
యే మహాపాపాల ♦ నైన హరించు

(326) నని వసిష్ఠు గురుండు ♦ ఘన బోధ జేయ
మనసుకొని యెల్లరా ♦ మోదంబు దాల్ప

(327) భరతనామము కైక ♦ పట్టికర్పించి
సరసలక్ష్మణుడన ♦ శత్రుఘ్నుడనగ

(328) మేటినామములు సు ♦ మిత్రపుత్రులకు
పాటవంజొప్ప నే ♦ ర్పాటొనరించి

(329) బంగారుపాత్రల ♦ జటు వక్షురాల
నంగుళీయకమున ♦ నట్లు చిత్రించి

(330) రంగారు సూపచా ♦ రముల బూజించి
మంగళాక్షతలతో ♦ మఱిమఱి కూర్చి

(331) మాంసనక్షత్రనా ♦ మ వ్యవహార
శ్రీసువర్ణాక్షర ♦ శ్రేణి కీలించి

(332) యనఘులు మునులు దీ ♦ ర్ఘాయురస్తనుచు
మనుజేశు ప్రేయసీ ♦ మణులను సుతుల

(333) సలలితాక్షత పుష్ప ♦ సంతతులంది
విలసిత సామాది ♦ వివిధ గానముల

(334) ఆశీర్వచనమిచ్చి ♦ హర్షమ్ము గూర్ప
దా శుక్లపక్ష సు ♦ ధాకర రేఖ

(335) సరణి శ్రీరాములు ♦ సౌమిత్రి గూర్మి
భరత శత్రుఘ్నులు ♦ ప్రబలి రబ్రముగ

(336) నిరువదియొక్కరో ♦ జేర్పడ నపుడు
సరసబంధుకదంబ ♦ సంతోషమొదవ

(337) నగరు శృంగారించి ♦ నవరత్ననూత్న
నిగనిగ ద్యుతుల వ ♦ న్నియ మొలకలెత్త

(338) పన్నీటగడిగిన ♦ భవ్యసౌధముల
క్రొన్నెలఱాల ని ♦ గ్గుల వేదులందు

(339) మణిదీపికాస్తంభ ♦ మానితదీప్తి
నినుమడించుచు గడు ♦ హేల బాలికలు

(340) గుమిగూడి పనులందు ♦ కొనుచు తాంబూల
సుమఫల వితతు ల ♦ చ్చోటుల నింప

(341) మెఱుపుతీవియలన ♦ మిఱుమిట్లు గొల్పు
మెఱుగుబోణులు నీల ♦ మేఘాల డాల

(342) జిగిపావడలుగట్టి ♦ చెయి చెయి బట్టి
మొగసాలదిరుగాడ ♦ మూగు కేకులకు

(343) నదనుగాదని వాటి ♦ నాటలదార్చి
పదపదజాగింత ♦ పాడిగాదనుచు

(344) తోట్లపేరంటంబు ♦ దోతెంచు డనుచు
బొట్లుకుంకుమతోడ ♦ పురమెల్లబిలచి

(345) బంగరు పళ్ళెరాల్ ♦ పంక్తులు దీర్చి
రంగవల్లుల మధ్య ♦ రంగాన నుంచ

## (డోలోత్సవము)

(346) పుణ్యాంగనలు ప్రియం ♦ బున పేరటముల
ధన్యులబాలుర ♦ దగ్గర జేరి

(347) పసిడి యుయ్యాలలలో ♦ బాలుర నుంచి
ముసరి కోకిల రవ ♦ మ్రోతలు నింగి బొంగ

(348) పాటలువాడిరి ♦ పగడి కెంగేల
హాటకనిగళంబు ♦ లంటి తంత్రులుగ

(349) ముసిముసినగవుల ♦ ముద్దు లొల్కించు
పసికూనలగుదండ ♦ బట్టియూపుచును

(350) జోజో కులోద్ధార? ♦ జో రఘువీర
జోజో శుభాకార? ♦ జో మేరుధీర

(351) జో రాక్షసవిదార! ♦ జో చక్రధార
జో రమ్యగుణహార ♦ జో చిత్తచోర

(352) జో దశరథపుత్ర ♦ శుభద చరిత్ర
జో దీనపరిరక్ష ♦ సురగణాధ్యక్ష

(353) జో నిత్యకల్యాణ ♦ జో దివ్యబాణ
జో నవ్యశరతూణ ♦ సుమబాణబాణ

(354) దివ్యమంగళరూప ♦ స్థిరతరాటోప
భవ్యసాకేత ప్ర ♦ పాలనోద్దీప

(355) సమదవైరి విరామ! ♦ సంగ్రామ భీమ
రమణీయ జయరామ ♦ రఘురామ రామ

(356) కోసలేశ్వరరామ ♦ కోదండరామ
భాసమంచితరామ ♦ పట్టాభిరామ

(357) తరళాంబుదశ్యామ ♦ దశరథరామ
కరమర్థినేలవే ♦ కాకుత్సరామ

(358) తపనవంశాబ్ధి సు ♦ ధాకర కిరణ
విపుల వేదాంతార్థ ♦ విశ్రుతాభరణ

(359) దయజూడరా లోక ♦ తత్త్వావతరణ
భయమడంచుచు మమ్ము ♦ పాలించు శౌరీ

(360) భవదీయలీల లీ ♦ బ్రహ్మాండమెల్ల
వివరించుననుచుంద్రు ♦ విజ్ఞులేవేళ

(361) సంసారసాగర ♦ సంకల్పతరళ
హంసతూలికదోగి ♦ యాడుచున్నావ

(362) జగములన్నిటినూప ♦ జాలిన నిన్ను
మగటిమి నూపగ ♦ మాభాగ్యమన్న

(363) కౌసల్యనినుగాంచ ♦ కౌగిటనుంచ
వాసిచన్నుడిపింప ♦ వ్రేలుదిలకించ

(364) దోసిటనిన్నెత్తి ♦ తొట్లలోనుంచ
హాసంబుతో ముద్దు ♦ లాడుచు బెంచ

(365) పోరేలననుచు మా ♦ న్పును బుజ్జగింప
గారాబముగ జిన్ని ♦ కావుబొట్టుంచ

(366) తొలిజన్మమున నేమి? ♦ దుష్కరతపము
వెలయించెనో తండ్రి ♦ వేడ్కలూరంగ

(367) కావుబొట్టుంచి ర ♦ క్షలు నీకు గట్టి
పావనంబుగ నుగ్గు ♦ పాల్ వ్రేలుగుడుప

(368) మహనీయ పురుష? మీ ♦ మంత్రసానులును
బహుజన్మములజేయు ♦ భాగ్యంబదేమొ.

(369) అనిభక్తి తాత్పర్య ♦ మచ్చొత్తునట్లు
మనుకులాభరణుని ♦ మఱి సోదరులను

(370) డోలోత్సవముల కు ♦ టుంబినులెల్ల
లాలించి వెడలి రిం ♦ డ్లకు విడెమంది

(371) క్రమముపనభివృద్ధి ♦ గాంచుచు వారు
తమ బాల్యదశలెల్ల ♦ దవిలివవేళ

( రామాదుల బాల్యము )



(272) ననిమిషత్వమున మ ♦ త్స్యావతారంబు
గొనిబోరగిలబడి ♦ కూర్మరూపంబు

(373) పదహస్తముల జతు ♦ ష్పద సూకరంబు
మది శిశుస్నేహ సం ♦ పద నృసింహంబు

(374) పిన్నని యడుగుల ♦ బ్రియవామనంబు
క్రొన్నిటియాటల ♦ గురు భార్గవంబు

(375) పురుషోత్తమ దశా ♦ పూర్వావతార
సారస్యముల శిశుల్ ♦ సలిపిరి క్రీడ

(376) అత్తత్త? నాయన? ♦ అమ్మా యటనుచు
మెత్తనిపల్కుల ♦ మేల్మి బల్కుచును

(377) చేతులెత్తగ నేర్చి ♦ చిన్నన్నరార
నాతండ్రియని పిల్వ ♦ నవ్వంగ నేర్చి

(378) రారా యటన్న దూ ♦ రంబేగ నేర్చి
మారుపల్కుల గూడి ♦ మాటాడ నేర్చి

(379) బొమ్మలు బోనాలు ♦ పుట్టచెండ్లాడ
నమ్మహీశ్వర సుతు ♦ లందంద తిరుగ

(380) కౌసల్య యిచ్చిన ♦ ఘన పాయసాన్న
మా సుమిత్రాదేవి ♦ యందినదాన

(381) కలిగిన సౌమిత్రి ♦ ఘనుడు లక్ష్మణుడు
బలి రామవిభు బహిః ♦ ప్రాణమైకొలిచె

(382) నలకైకపాయస ♦ మందుటకతన
కలిగిన శత్రుఘ్ను ♦ ఘనమూర్తి భరతు

(383) నేవేళ విడనాడ ♦ కెఱిగి సేవించె
భావంబులో భక్తి ♦ పాదానురక్తి

(384) షుష్వురొక్కటిగాగ ♦ మోదాప్తి గొలిచి
యవ్వీర శ్రీరాము ♦ నర్చించుచుండ

(385) సోదరత్రయమును ♦ శుభదృష్టి నేలి
యాదరంబును జూపె ♦ నారామమూర్తి

(386) ప్రతిపదంబున నిటుల్ ♦ బాల్యకాలంబు
కుతుకంబుతో నాడు ♦ కొనుచుండు వేళ

(387) నక్షరాభ్యాసంబు ♦ లలరించి రాజు
శిక్షార్హ విద్యల ♦ జెప్పించుచుండె

(388) చౌలోపనయనముల్ ♦ సమయంబు లెఱిగి
లీలగావించి ని ♦ లింపులౌననగ

(389) గురు వసిష్ఠుని చెంత ♦ గోరెఋ వేదములు
మఱి యథర్వణ వేద ♦ మంత్రతంత్రములు

(390) శరకరలాఘవా ♦ చార లక్ష్యములు
సరణి దప్పక నేర్పి ♦ జనపాలుడుండ

(391) హయ గజ రథ చాల ♦ నాభ్యాసవిధుల
రయమొప్ప నేర్చియా ♦ రాజనందనులు

(392) భయద సంగరరంగ ♦ పాండిత్యమందు
జయఘంటికల దాల్చి ♦ చతురులై యుండ

(393) చతురంగబల ఘోర ♦ సమరారిపర
తతిగండడంచు ప్ర♦తాపంబు దాల్చు

(394) నలువురు తనయుల ♦ నానా విధాస్త్ర
కలితులవీక్షించి ♦ క్ష్మాతలేశ్వరుడు

(395) మహితసుమంత్రాది ♦ మంత్రులతోడ
మహనీయులను చు గు ♦ మారుల వాగడ

(396) తగదని తమదుచి ♦ త్తములలో మిపుల
సుగుణులంచుప్పొంగి ♦ చూచుచు నుండ



## (విశ్వామిత్రుడరుదెంచుట)

(397) గాధినందనుఁడైన ♦ కౌశికమౌని
సాధితబ్రాహ్మ్యుండు ♦ క్షత్రకులుండు

(398) సునిశితగాయత్రి ♦ శుభమంత్రసిద్ధి
నొనరగావింప మ ♦ హోగ్రతపోగ్ని

(399) తన క్షత్రదేహమెం ♦ తయు వ్రేల్చివ్రేల్చి
జననుత బ్రహ్మ తే ♦ జము గొన్నవాడు

(400) గాయత్రిమణిని చ ♦ క్కని వన్నెదార్చ
వేయేల? నికషణ ♦ వెలయించుసాన

(401) సృష్టికిప్రతిసృష్టి ♦ సిద్ధింపజేసి
స్రష్టనైనను వగ ♦ సాధించు మేటి

(402) తన తపశ్శక్తితో ♦ దశదిశావలయ
ఘనకులాద్ర్యవని సా ♦ గర చక్రవాళ

(403) ముఱ్ఱూతలూగించ ♦ నొక్కొకమారు
గిఱ్ఱునత్రిప్ప సా ♦ గిన సాహసుండు

(404) భీకరాధర్వణ ♦ ప్రియవేదవేది
సాకల్యముగ నింద్ర ♦ జాలికు డతడు

(405) క్రీడాపరుడు తృణీ ♦ కృత పురందరుడు
షోడిమి లోకైక ♦ పూజ్యతపస్వి

(406) భగవదర్పణముగ ♦ ప్రక్రియాధ్వరము
తగవెంచి పలుసార్లు ♦ తా జేయుబోవ.

(407) రావణుప్రేరణ ♦ రాక్షసకోటి
కావలుల్ మఱి తాట ♦ కాసుత ద్వయము

(408) కొనసాగనీకున్న ♦ కోపించివారి
దునుమగాదలచి త ♦ ద్దోషంబుకతన

(409) పూర్వపుణ్యంబులు ♦ బొలియు కొఱంగి
సర్వాత్ముడే దీని ♦ సాగించు ననుచు

(410) సాధించిన బ్రాహ్మ్య ♦ సాత్వికమెల్ల
క్రోధోపహతిజొచ్చు ♦ రూపఱుననుచు

(411) బూదిలో హోమమై ♦ పోయినమీఁద
రాదనిచింతించి ♦ రహి యదనెంచి

(412) సాకేతమున రామ ♦ చంద్రు సౌమిత్రి
నాకార్యమునకయి ♦ యాచింపదలచి

(413) దశరథేశ్వరు సభా ♦ స్థానంబుజేర
కుశికనందనుడు కో ♦ ర్కులు మీరవచ్చె

(414) పుట్టుకతో క్షాత్ర ♦ భూత తేజంబు
పట్టయి సాధించు ♦ బ్రాహ్మ్య తేజంబు

(415) మునిరూపమున జగ ♦ న్మోహనమగుచు
చనువున వాకిట ♦ సాక్షాత్కరింప

(416) వచ్చిన మునివార్త ♦ ప్రతిహారి దెలుప
జెచ్చెర యెదురేగి ♦ సేమంబు లడిగి

(417) యుచితపీఠంబున ♦ నునిచి పాద్యంబు
రచియించి పూజ ల ♦ ర్పణముగ జేసి

(418) కరములు జోడించి ♦ క్ష్మాపతి పలికె
పరమ తపస్వి లే ♦ పనులు మావలన

(419) తాము కోరుటకు భూ ♦ తలి కానరావు
ప్రేమించి వచ్చిన ♦ రీతి గన్పట్టె

(420) ధన్యుని నను జేయ ♦ దలచి కాబోలు
మాన్య? మీరాకని ♦ మదిలోన దోచె

(421) పనిబూనికినిసిన ♦ బ్రహ్మకు బదులు
ఘననవబ్రహ్మల ♦ గలిగింపగలరు

(422) సంకల్పమాత్రాన ♦ శతముఖునైన
కింకరుగా జేయు ♦ కేవలశక్తి

(423) సంపన్నుడవు పూర్వ ♦ జన్మ భాగ్యంబు
జెంపొంద జేయగ ♦ బ్రియపడి యేమొ

(424) దైవరూపంబుగ ♦ దామగుపడుట
పావనత్వము గల్గె ♦ ప్రజలకు మాకు

(425) ఉప్పునీరముద్రావి ♦ యుదధి మేఘములౌ
గొప్పవర్షంబుల ♦ గురిపించి ప్రజకు

(426) జీవనాధారంబు ♦ జేసిన యట్టుల
పావన కిరణ ప్ర ♦ భావంబు వలన

(427) భూవారి బీల్చుచు ♦ భువనబాంధవుడు
దైవమై జీవుల ♦ దగ నుద్ధరింప

(428) మధురోదకములిచ్చి ♦ మనుచు చందమున
నధములైవగచు బ్ర ♦ జావళి వలన

(429) పన్ను లించుకగొని ♦ ప్రభువులు కరుణ
నెన్నియు సౌఖ్యంబు ♦ లిచ్చుచు ప్రజల

(430) మన్నన రక్షించు ♦ మార్గంబు దోప
నన్నాదరించుచు ♦ హావల్ల నేమి

(431) చిన్నికార్యము నపే ♦ క్షించి వచ్చితిరొ
యున్నతి నను జేర్ప ♦ నూహాలు దక్క

(432) హృన్నళినంబున ♦ నే కోర్కెలైన
చెన్నలరారు నే? ♦ చేతనైనంత

(433) తలతోడదాల్తు మీ ♦ దాసదాసుండ
సెలవొసంగుడు దివ్య ♦ చిత్తవృత్తంబు

(434) అనిభక్తి కీర్తింప ♦ నయ్యోగపురుషు
డనియె సీరీతి నె ♦ య్యమున ప్రేమించి

(435) దిననాథ కులనాథ? ♦ దేవరవారి
ఘనకీర్తి కనువైన ♦ కరణి బల్కితివి

(436) అవిదూర పర్వత ♦ మందలి గనుల
భవమొందునే? గాజు ♦ పలుకులు పెలుచ

(437) నిగమాంతరార్థ ప్ర ♦ నిర్మలభావ్య
సుగమపద్ధతిదల ♦ జూపునే? మాయ

(438) చెదలు నిప్పులను స్పృ ♦ శింపంగగలదె
యుదయభానుని మ్రింగ ♦ నోపునే? తమము

(439) సాధు పతివ్రతా ♦ చరణ శీలముల
బాధించునే? యెట్టి ♦ ప్రకృతిబెడంగు

(440) నైజగుణంబు లె ♦ న్నటికి లోకమున
సాజంబు గనుమార్పు ♦ సమకూరబోవు

(441) మనుకులేశ్వరుడవొ ♦ మానవపతివి
నిను ధర్మదేవత ♦ నే డాశ్రయించె

(442) కలదొక కార్యమి ♦ క్కడకు నారాక
ఖలశిక్షణార్థమై ♦ క్ష్మాతలనాథ

(443) పరమేశ్వరప్రీతి ♦ భవ్యాధ్వరంబు
జరుపుచు నది కొన ♦ సాగింపలేక

(444) నెన్నినాళ్లాయెనో! ♦ యినవంశతిలక
మన్ననసంకల్ప ♦ మాత్రాననుంటి

(445) సాగింపదలకొని ♦ సాగక మాని
ఆగుచున్నాడ బ్ర ♦ యాసంబు నంది

(446) తాటకాతనయు లు ♦ త్కట బాహుబలులు
పోటరుల్ మారీచ ♦ భూరి సుబాహు

(447) లమితసేనలగూడి ♦ యధ్వరక్రియల
సమయించి హోమాగ్ని ♦ చల్లార్చినారు

(448) రక్తవర్షముల ధా ♦ రల నపారముగ
నక్తంచరాధముల్ ♦ నయదూరులగుచు

(449) గురిపించుచున్నారు ♦ కూళలువారు
పరమయోగుల జటా ♦ పటలముల్ బట్టి

(450) క్రమ్మర కొందరి ♦ గడ్డముల్ బట్టి
హుమ్మని యుయ్యాల ♦ లూగుచున్నారు

(451) ప్రియహోతృజనులను ♦ పేడ కేలుగట్టి
దయవీడి కొనకాళ్ల ♦ దన్నుచున్నారు

(452) సాన్నాయ్యములుగల ♦ చరుపాత్రలందు
క్రొన్నెత్తురులు మింట ♦ గుప్పించినారు

(453) కౌపీనములులాగి ♦ కటిసూత్రపటలను
రాపాడి త్రెంచి యూ ♦ రక నగినారు

(454) దక్షిణాగ్నిప్రవర్గ్య ♦ దలచినమాత్ర
నక్షీణకుపితులై ♦ యాగ్నీధ్రుగొంతు

(455) బిగబట్టి గాయత్రి ♦ భీకర ఖడ్గ
మగడుచేయుచు మంట ♦ నడచుచున్నారు

(456) మంత్రశక్తినబుట్టు ♦ మహానీయబలుల
తంత్రంబు జెఱచి యీ ♦ దారినున్నారు

(457) సురవైరిసేనల ♦ శూరవర్గముల
ధరగూల్చి యజ్ఞమం ♦ తయుజేయజేయ

(458) సౌమిత్రితో రామచంద్రునిబంపు
మామాత్రమైన నా ♦ కంతియచాలు

(459) నన విని హరిహరీ? ♦ యని చెవుల్ మూసి
జననాథు డిట్టులు ♦ సం యమికనియె

(460) రామలక్ష్మణులన ♦ రాక్షసేశ్వరుల
తామసంబున జంపు ♦ దంటలుగారు

(461) వయసెంతయని ముని ♦ వర? దలంచితివో
ప్రియసుతుల్ మిక్కిలి ♦ పిన్నవారనఘ?

(462) వేడుకకై చేత ♦ విలుదాల్త్రుగాని
వాడిశరంబుల ♦ పట్టుకే. లేదు

(463) పాలబుగ్గలును ను ♦ పల్కులు బుడుత
లాలంబొనర్పగ ♦ నర్హులా? వారు

(464 ప్రేలాడుకూకట్లు ♦ విడదీసి తలగ
జాలరు శ్రీరామ ♦ చంద్ర లక్ష్మణులు

(465) పూపప్రాయులు రణ ♦ భూమిలో నిలిచి
పాపుల వధియించు ♦ పాటిరుగారు

(466) ఘోరరాక్షసులేడ? ♦ కొమరులు నేడ?
రారమ్మనగ యజ్ఞ ♦ రక్షణయేడ

(467) బాహువిక్రమకళా ♦ పారీణులనుచు
నూహించి యడిగిన ♦ బ్లున్నదకైన

(468) కాదననేల మీా ♦ ఘన మఖరక్ష
నీదాసదాసుడే ♦ యేర్పడజేయు

(469) నేనరుదెంతు మా ♦ ని కులాగ్రగణ్య
ఆనిశాచరుల యు ♦ ద్ధావనిగూల్తు

(470) సవనంబు జరిగింతు ♦ జడితు నింకేల?
వివిధాస్త్రముల్ దాల్చి వేవేగవత్తు

(471) ననదుస్సహక్రోధ ♦ మానసమందు
గానిపల్కెనాముని ♦ కుంజరుండధిపు

(472) కూసితప్పుటకు జం ♦ కును దాల్పవౌర
శాసింతు నిను హరి ♦ శ్చంద్ర వంశ్యుడవ?

(473) సత్యహరిశ్చంద్ర ♦ సత్కీర్తినైన
కృత్యంబుగా జూడ ♦ కిటులుండెదౌర

(474) శిబివంశభవుడవా? ♦ సేబాసు? భూప
ప్రబలసత్యవ్రత ♦ బంధుర మతివి

(475) అడిగినకోరికె ♦ నందింతుననుచు
నడిగినవంచింప ♦ నాత్మగౌరవము?

(476) ఆనీచుల వధింప ♦ నలవి నీకైన
నేనేల? జంపక ♦ నిను వేడవలసె

(477) ధనువు శస్త్రాస్త్రముల్ ♦ దగ్గర లేవో?
మనములో మంత్రముల్ ♦ మఱచిపోయితివో

(478) మనపని కాదని ♦ మానవనాథ
సనకాదినుత్యుండు ♦ సాకేతవాసి

(479) శ్రీరామచంద్రుడా ♦ శ్రిత వత్సలుండు
ఘోరారి దమనుండు ♦ గూల్పగలండు

(480) భగవంతుడని వేడ ♦ బాలకుడనుచు
నిగమగోచరునంప ♦ నీవడ్డుపడెదో?

(481) అనిపల్క రాజు మా ♦ టాడంగ లేక
విని మౌనము వహించె ♦ వినని చందమున

(482) ఆసమయంబున ♦ నలవశిష్ఠుండు
కోసలాధిపతితో ♦ గొంకక పలికె

(483) నరపాల? నీకూర్మి ♦ నందనులనుచు
మురిపెంబు విడలేక ♦ ముగ్ధుడవైతి

(484) వయ్యారో? శ్రీరాము ♦ డఖిలేశ్వరుండు
వెయ్యేల? దైత్యుల ♦ విదళింపబుట్టె

(485) సామాన్యుడనుచు ల ♦ క్ష్మణు జూడబోకు
భూమాన్య శేషుడీ ♦ పురుషర్షభుండు

(486) నృపతి! విశ్వామిత్రు ♦ నేర్పినవీరు
రిపుభయంకరులయి ♦ ప్రీతి బొల్చెదరు

(487) ఉపకారియయివేడ ♦ ఊయనకిటుల
నపచార మొనరింప ♦ నర్హమా? రాజ?

(488) భయదశస్త్రము లథ ♦ ర్వణ రహస్యములు
రయమున నేర్పించు ♦ రామలక్ష్మణుల

(489) ననుమానమునువీడి ♦ యంపుమా? మౌని
మనకెన్ని శుభములో ♦ మఱియు జేకూర్చు

(490) పురహరు రౌద్రప ♦ పూర్ణాస్త్ర చయము
నరనాథ? యీముని ♦ నాథుని సొమ్మ

(491) ధీరతతో నుప ♦ దేశంబు గూర్చి
ఘోరరాక్షసులను ♦ గూల్పింపగలడు

(492) ఘన నదీమూలముల్ ♦ గనిన సన్నములు
ఘనులు జన్మస్థాన ♦ గణనలో నటులె

(493) ప్రవహించి వ్యాపించి ♦ ప్రఖ్యాతికెక్కు
వివిధనదుల్ ఘనుల్ ♦ విశ్రుతులెందు

(494) నీపుత్రుడితడను ♦ నెగులునుమాను
కాపురుషుల గూల్ప ♦ గల విష్ణుమూర్తి

(495) ఏల? యోచించెద ♦ వెడద శ్రీరాము
నాలక్ష్మణునిగూర్చి ♦ యంపింపుమనిన

(496) దేవరయాజ్ఞ యి ♦ దే? వచ్చిరనుచు
భూవరుండా ముద్దు ♦ పుత్రుల జంట

(497) రావించి శ్రీరామ? ♦ రార? సౌమిత్రి?
ఈ వీరమునివెంట ♦ నిర్వురు కదలి

(498) రాక్షసాధముల ధ ♦ రాస్థలిగూల్చి
రక్షింపవలె నధ్వ ♦ రమ్మనస కోరె

(499) గురునాజ్ఞ దీవనల్ ♦ గొనుడన్నలార!
సరణిదప్పక వేగ ♦ సాగింపుడనిన

(500) తనతండ్రి కెఱిగిం ♦ చెను రామమూర్తి
యనుమానమును వీడు ♦ మని యిటు బలికె

(501) గురుదీవనలు దమ ♦ గొప్పయనుజ్ఞ
వెఱపేల దేనినే ♦ విపుల సాధింతు

(502) దనుజు లెంతటివారు ♦ తమ యాజ్ఞయైన
తునియలొనర్ప మే? ♦ దురములో నెదుర

(503) నిమిషార్థమున జంపి ♦ నిశిచరాధముల
మునియజ్ఞరక్షణ ♦ సాగింతుకనుము

(504) తాత? దేశికపాద ♦ దండంబులయ్యె
ఈతపోనిధివెంట ♦ నేగ ననుజ్ఞ

(505) అనుచు విశ్వామిత్రు ♦ డాదృతి జూడ
జననుతకోదండ ♦ చండకాండముల

(506) దూణీరమును జేర్చి ♦ దోర్మూలమందు
తాను కేలున ధను ♦ ర్దండ మందుకొని

(507) రార! సౌమిత్రి! తీ ♦ వ్రముగ రమ్మనుచు
వీరాంకవీరుడై ♦ వేడుక లేచి

(508) హేలతో బెండిలి ♦ కేగినరీతి
బాలుడై లోన ని ♦ ర్భయవృత్తి మాని

## ( య జ్ఞ ర క్ష ణ )

(509) తమ్ములతో సజ్యకో ♦ దండమ్ముతోడ
దమ్ములనేలునే ♦ త్రమ్ములతోడ

(510) కోరి మోమున వ్రేలు ♦ కూకట్లతోడ
తీరైనకస్తూరి ♦ తిలకమ్ముతోడ

(511) ఘనవజ్రమయమగు ♦ కవచంబుతోడ
మునియజ్ఞరక్షణా ♦ మోదమ్ముతోడ

(512) సరిగంచు చిన్ని దు ♦ శ్శాలువతోడ
చిఱుతధోవతుల కు ♦ చ్చిళులతోఁగూడ

(513) బింకంబుతోఁగాశ ♦ బిగువులతోడ
వంకరపిడి ఖడ్గ ♦ వల్లులతోడ

(514) మదదైత్యులను ద్రుంచు ♦ మగటిమితోడ
కొదలేని జల్లెడు ♦ గుండెలతోడ

(515) సంకల్పమాత్రాన ♦ సకలంబుమార్చు
శంకారహిత సర్వ ♦ శక్తులతోడ

(516) పంకేజముల తూండ్ల ♦ పద్మాకరమున
జంకకుత్సారించు ♦ సమదగజంబు

(517) పొంకంబుతోఁగాధి ♦ పుత్రుని వెంట
శంకింపకానంద ♦ సాగరుండగుచు

(518) శ్రీరామచంద్రుఁడా ♦ శ్రితపారిజాతుఁ
డాయూఢి జనతమ్ము ♦ డాతని వెంట.

(519) ముదమునజనుచు నా ♦ మునికట్ర మొక్కి
పదపడి మఱి మఱి ♦ ప్రార్థించి యడుగ

(520) శిష్యవత్సలతని ♦ చ్చిన కక్షుపాల
శిష్యుఁడై రాముఁడు ♦ జేకొనె నతని

(521) తమ్ముఁడు సౌమిత్రి ♦ దాసానుదాసు
డిమ్ములఁగలఁడు మీ ♦ రేల? వహింప

(522) వనిఁగొని చనుచుండ ♦ నా యరణ్యమున
జనుదెంచె దొలుదొల్త ♦ సరయూ తటంబు

( సరయూవర్ణనము )

(523) శ్రీరాముడందు వీ ♦ క్షించు జిత్రముల
నారసి మునితోడ ♦ ననియె నీరీతి

(524) సెలయేళ్ల మొత్తముల్ ♦ శిఖరాగ్రములను
తళతళత్తళలతో ♦ దారులుగట్టి

(525) సరయుజేరెడు స్వచ్ఛ ♦ జలముల లోయ
లరరె? యెంతటి హృద్య ♦ మచ్చొత్తె? ననఘ

(526) తరుణపల్లవ లతా ♦ తరుచలచ్ఛాయ
పరిమళంబులు నదీ ♦ పరిసరస్థలులు

(527) సారవ కైరవ ♦ సరసిజ కుసుమ
సారసంచార ష.♦ ట్చరణ దంపతులు

(528) బారువై పాటక ♦ చేరి సాగింప
కోరి శీర్షములూచు ♦ కొనుచు మృణాళ

(529) నాళముల్ గొంటుచు ♦ నళిన పీఠముల
జాల తరంగాగ్ర ♦ చరులూపు లూప

(530) లీల మవ్వపుమరా ♦ ళికలతో దూగు
లాలిత నవమరా ♦ ళముల మొత్తములు

(531) పర్వత వృక్ష ప్ర ♦ భా భాసమాన
సర్వఫలావాప్తి ♦ సంచారజంతు

(532) సంతత ఫలహార ♦ సదనమై ప్రాదిని
శ్రాంతిమై పానీయ ♦ శాలగా మెలగె

(533) తేటిగీతములు పూ ♦ దేనియవిందు
కూటముల్ నెమళులు ♦ గూర్చునాట్యములు

(534) పికకూజితంబులో ♦ పికఁబచరించు
నికటశీతల గుణా ♦ నిల కిశోరములు

(535) సదమలవారి ని ♦ శ్చలవృత్తిగలిగి
యుదరాంతరంబెల్ల ♦ నొగి బ్రదర్శించి

(536) సదమలయోగ ని ♦ ష్ణాతరూపించు
హృదయసీమ విధాన ♦ నీ నదీ జలము

(537) ప్రతిబింబితాభ్రమై ♦ భాసిల్లదొడగె
నతిమోదమని తెల్ప ♦ హర్షించిమాని

(538) శ్రీరామభద్ర యీ ♦ క్షితికలంకార
సార తపోధనా ♦ స్థానభాగములు

(539) చేరువనివియెల్ల ♦ సిద్ధాశ్రమములు
వారకగంగాప్ర ♦ పాత పూతములు

(540) సరయూ మహానదీ ♦ సలిల పావనము
లురు పుణ్యభూము ల ♦ యోధ్యాధి నాథ

(541) అనిపల్క శ్రీరాము ♦ డానదీమాత
వినిపించునోంకార ♦ విధము నెఱింగి

(542) మునిజూచి యోంకార ♦ ముగ మహారవము
మనకిచ్చు కదలని ♦ మానోదకములె

(543) చిత్రమిదేమని ♦ శ్రీరాముడనిన
పాత్రతనామాని ♦ పలికె నీరీతి

(544) నిస్తరంగంబుగ ♦ నిశ్చలత్వముగ
బ్రస్తుతోంకార శ ♦ బ్దము నదీమధ్య

(545) మునగల్గుటేలన? మున్ను కైలాస
మున బ్రహ్మమానస ♦ ముఖ్యసరస్సు

(546) లోంకార నాద ది ♦ వ్యోచ్చారణముగ
నంకురితము జేసె ♦ నాజీవనములు

(547) సరయూముఖంబున ♦ శబ్దితమగుచు
సరసిజాసను వేద ♦ సారభూతమును

(548) వరప్రణవాక్షర ♦ వ్యాప్తి నేవేళ
బరగించు నీనది ♦ పార్థివచంద్ర

(549) ఈనదిమహిమల ♦ నిది రహస్యంబు
భూనభోంతరముల ♦ బుణ్యప్రదంబు

(550) స్నానంబు లిచ్చట ♦ జరిగించి యర్ఘ్య
దానోదకంబులు ♦ తరణి కర్పించి

(551) అలమంత్రమాతగా ♦ యత్రిని బొగడి
కల విశేషములు వ ♦ క్కాణింతు ననిన

(552) చిత్తమటంచు నా ♦ శ్రీరామమూర్తి
తత్తటంబున జన్ని ♦ తమ్ముడు దాను

(553) సంకల్పముల తోడ ♦ స్నానముల్ దీర్చి
పంకజాప్తున కర్ఘ్య ♦ పాద్యంబు లిచ్చి

(554) పంచభూతస్తుతుల్ ♦ బరగించి మౌని
గాంచినమస్కృతుల్ ♦ గావించి నిలువ

(555) బాలురజూచి య ♦ పారకృపాప్తి
దేలించి లాలించి ♦ దృష్టిసారించి

(జలబల జృంభకాస్త్రాదు లనుగ్రహించుట)



(556) కోదండరామ? యీ ♦ ఘోరతరారణ్య
మేదినుల్ మునుముందు ♦ మీకును నాకు

(557) దుర్భయదంబులై ♦ తోపగాగలవు
గర్భ నిర్భేదులౌ ♦ కర్బురులిందు

(558) నాకలిదప్పుల ♦ కదనుమీకెడరు
ప్రాకటనుబలాతి ♦ బల విద్య లివిగో

(559) వీనినుపాసింప ♦ వెయ్యేడులైన
గాని క్షుత్తృష్ణలు ♦ కలుగంగబోవు

(560) కొనుడని మంత్రముల్ ♦ గోప్యపద్ధతిగ
ననుకూల మొదవించి ♦ యామీదమాని

(561) మాయావులైన దు ♦ ర్మార్గుల నణప
సాయకంబులివెల్ల ♦ చాలవుగాన

(562) చేకూర్తు నీయ్యవి ♦ జృంబకాస్త్రములు
కాకుత్స్థరామ! యీ ♦ ఘనసాయకములు

(563) పదునాల్గు లోకాల ♦ ప్రకృతి మర్మముల
విదళించి మీయాజ్ఞ ♦ వెలయింపగలవు

(564) గురిలక్ష్యశుద్ధి లీ ♦ ఘోర బాణముల
నరిబోయుచోజూచు ♦ టనవసరంబు

(565) సంకల్పమాత్రాన ♦ చతురాననాది
సంకల్పములనైన ♦ జలపట్టి మార్చు

(566) తాత శ్రీ రఘువు, మాం ♦ ధాత్ర ముఖ్యులును
నీ తీవ్రబాణార్చు ♦ లే వేళదాల్చి

(567) భువన భీకరులయి ♦ పొలిచిరానాడు
జవనాస్త్రములు గాంచి ♦ జయము సాధించు

(568) మని జృంభకాదిమ ♦ హాస్త్రంబులీయ
కౌనియుపాసింపను ♦ కృశాన మహాస్త్రములు

(569) సౌమ్యరూపంబుల ♦ సాక్షాత్కరించి
రమ్యస్వరూప శ్రీ ♦ రామాభిరామ

(570) నమ్యుడవీవాది ♦ నారాయణుడవు
గమ్యస్థలంబుల ♦ కనుసన్న దెలుప

(571) సకలచరాచర ♦ జంతు సంతాన
నికటాధిపత్యంబు ♦ నెలకొల్పగలము

(572) మాకనుజ్ఞ యటంచు ♦ మహనీయ బాణ
నికరంబులతనిలో ♦ నిండారి వెలయ

(573) మునిచంద్రుగను గాని ♦ మ్రొక్కి శ్రీరామ
జనపతితనయుండు ♦ సౌమిత్రితోడ

(574) సంపూర్ణకళలతో ♦ సంతోషమంది
శంపాలతికలట్ల ♦ సరసననిల్వ

(575) మునివరుడానంద ♦ మునుదాల్చివారి
వెనువెంటమార్గాన ♦ వెళ్ళుచునుండ

(576) శ్రీరామచంద్రుడా ♦ సిద్ధమునీంద్రు
సారమారా? యని ♦ సకల మూహించి

(577) ఘోరరక్షశ్శాంతి ♦ గానకొని చేయ
వీరాంకవీర! యీ ♦ విద్యలేపాటి

(578) అల్పవీర్యులకయి ♦ యధ్వర మేల
నిల్పి వచ్చితివయ్య? ♦ నిర్మలచరిత

(579) అనవుడు గాధేయు ♦ డనియె శ్రీరామ
ఘనయజ్ఞదీక్షు సం ♦ కల్పించి నేను

(580) ఘోరాస్త్రముల మది ♦ గోరి కైకొనిన
నీరగు నాతపో ♦ నియమజలంబు

(581) సాధించితిని విప్ర ♦ జన్మశాంతంబు
బాధింపదలచిన ♦ బ్రాహ్మ్యంబుబోవు

(582) పరమవల్లభ సత్య భామణశాంతి
బారిపుచ్చలేక మీ ♦ పుట్టువుకొరకు

(583) కల మహాస్త్రంబుల ♦ క్కరదాచినాడ
ఇలనుద్ధరింప నం ♦ దిచ్చితి నిపుడు

(584) పరమేశ్వరాజ్ఞ యీ ♦ భారంబునెల్ల
శిరమునదాల్చుట ♦ శ్రీరామచంద్ర

(585) శరములు నీకిడ ♦ సర్వేశ్వరాజ్ఞ
నరమాత్రుడనుగాన ♦ నాకేమి హక్కు

(586) భారంబుదీరె స ♦ ర్వమయుండవీవు
ఘోరాసురుల జంపి ♦ గోత్రబాలింప

(587) నాయధ్వరంబిది ♦ నామమాత్రంబె
ఓయయోధ్యానాథ? ♦ యుర్వి భరించు

(588) క్షత్రియు దేహంబు ♦ జార్చిసుబ్రహ్మ
పాత్రదేహంబును ♦ వడసె నాశక్తి

(589) సడలింప నింకెన్ని ♦ జన్మమ్ములైన
పుడమి నంతటిశక్తి ♦ బొందంగ వశమె

(590) స్థిరకృపారస మాంద్ర ♦ శ్రీరామభద్ర
శరధివైనావు దా ♦ శరధివైనావు

(591) కరమర్థి రక్షింప ♦ గడఁగు మధ్వరము
పరమపావన? యని ♦ ప్రస్తుతిజేయు

(బ్రహ్మక్షత్రియ తేజోనిరూపణము)



(592) గురువర? శ్రుతులలో ♦ గులధర్మవృత్తి
పరమయోగ్యంబని ♦ పరగుచునుండ

(593) నదియు సుక్షత్రియా ♦ హవ సాహసములు
సదమల సామ్రాజ్య ♦ సౌఖ్యదంబగుచు

(594) సమకూరి యుత్తమ ♦ శక్తిత్రయమున
వినుతభయంకర ♦ వృత్తిబెంపెసగు

(595) స్వకులధర్మంబుల ♦జార్చి బ్రాహ్మ్యంబు
నకు యాచ్న కలవడ ♦ న్యాయమెట్లయ్యె

(596) ఏమధికంబు మీ ♦ కిందు గన్పడియె
నామది కెఱిగింపు ♦ నవసుప్రభావ

(597) అనినంత గాధేయు ♦ డతి మోదమంది
నను వేడెదే? ఆది ♦ నారాయణుడవు

(598) విను ముగ్గడింతు నా ♦ విజ్ఞత కలిమి
ననఘ పూజ్య ప్రశ్న ♦ మవని నియ్యదియె

(599) హృదయంబు నవనీత ♦ రీతి విప్రునకు
వదన రవంబులు ♦ వజ్రపాతములు

(600) వదన రవంబు సు ♦ వ్రతః మార్దవంబు
హృదయంబ భేద్యమై ♦ యెల్లసాధించు

(601) సదమల క్షత్రియ ♦ జాతుండితెంచు
వదన కఠోరత ♦ పరిఢిల్లుకతన

(602) భూసురుండరులను ♦ పోదోలుగాని
గాసి పెట్టెడు హింస ♦ గావింపలేడు

(603) వదనంబులో మృదు ♦ వాక్కులు దాల్చి
సదమలక్షత్రియ ♦ జాతుండు పగఱ

(604) సన్నిధిలో జేర్చ ♦ సామదానముల
నన్నిటిలో భేద ♦ మా దండవంబు

(605) మారిచి మార్చి స ♦ మగ్ర మంత్రాంగ
వీర విహారాల ♦ వేడ్క సాధించు

(606) నదికారణముగరా ♦ జ్యాంతంబునందు
నొందవును నరక మ ♦ హోగ్ర దర్శనము

(607) పరిపాలనాశక్తి ♦ ప్రజలలో కీర్తి
స్థిరభక్తినిల సుప్ర ♦ తిష్ఠ గావించి

(608) క్షత్రియుం డాచంద్ర ♦ శాశ్వత సుఖము
పాత్రత వడయును ♦ బహుప్రయత్నమున

(609) ప్రజల లాభమునకై ♦ పరమ విశ్వాస
భజనంబుతో హింస ♦ పథ మనుష్ఠించు

(610) శక్తిమంతుడు రాజు ♦ చలపట్టి చెరుప
భక్తినాదారు ను ♦ పద్రవ మొదవు

(611) పారుడే మఱచిన ♦ బరబాధ లేదు
సారెకు ద్రుటిదప్ప ♦ శాంతమే పారు

(612) భగ్భగ్గను తృణాగ్ని ♦ బహు శీఘ్రమందె
దృగ్భయంబుడిపి శాం ♦ తించిన కరణి

(613) నదికారణముగ శా ♦ పానుగ్రహముల
నుదయింపహేతువై ♦ యొప్పుబ్రాహ్మ్యంబు

(614) వాగపవిత్రమె ♦ వ్వరి కేమి చెఱుపు
సాగింపదాంతర్య ♦ శైత్యంబుకతన

(615) మొత్తనిపల్కుల ♦ మేల్మిగన్పఱచి
కత్తులబోనురై ♦ గారించునృపులు

(616) హృదయాపవిత్రులు ♦ హేలంవచస్సు
కొదువగానియ్యరు ♦ కోర్కెలుగొనగ

(617) గనుక నీయధికార ♦ గౌరవ మొదవి
జననాథులుత్తమ ♦ సాత్వికవిప్ర

(618 తతుల భేదింప న్వ ♦ తంత్రులుగారు
మతిబలం బనుగంటి ♦ మతివాక్కు మృదువు

(619) సుకృతంబుతో నిహ ♦ సుఖభోక్త లెందు
ప్రకటపదార్థైక ♦ పటుదృష్టి లేదు

(620) సంకల్పసాత్విక ♦ స్థానమౌబ్రాహ్మ్య
మింకదు ప్రసంగబో ♦ దెందది రాము?

(621) నేనిదిగాక ♦ నీగురువైన
మౌనివశిష్ఠుని ♦ మాన్యాశ్రమమున

(622) సపరివారుండనై ♦ స్వాగతమంది
కృపనందినీధేను ♦ కేవల మహిమ

(623) నాహార తృప్తుల ♦ మై యట్టిగోవు
బాహుజులకు జెల్లు ♦ పట్టణంబులను

(624) మీ కేలనన, సంయు ♦ మియు నిరోధింప
జేకొనకే నుగ్ర ♦ సేనలతోడ

(625) దుర్దాంత మహిమతో ♦ దోడ్కొనిపోవ
నిర్దయాత్ముని నను ♦ నిందించి గోవు

(626) రోమరోమంబున ♦ రుద్రులూర్వశిల
భీమబలంబున ♦ బిడుగులరాల్చి

(627) తోకవెంట్రుకలతో ♦ దోలె మమ్మెల్ల
సాకల్యముగ క్షత్ర ♦ సారమి తలతి

(628) యనుచుసాత్వికము గా ♦ యత్ర్యుపాసనము
జమువొప్ప యుగములు ♦ సాధించినాడ

(629) దత్తపోద్రేకాన ♦ దనువెల్లిమాఱి
యుత్తేజమున బ్రాహ్మ్య ♦ మొందిన నన్ను

(630) శమదమంబులు సత్య ♦ శౌచముల్ వలచె
గమలాసనుడు విప్ర ♦ గణనార్హుడనియె

(631) గాని వశిష్ఠుడా ♦ కరణి నన్నక
డానగ్రజుండుగ ♦ దలచుచునుండ

(632) మఱి తపంబొనరించి ♦ మూడ్చిలోకముల
విరమింపుమనినన్ను ♦ వేల్పుపెద్దడుగ

(633) మీావశిష్ఠుడు బ్రహ్మమేధావి నన్ను
పావన బ్రాహ్మణ ♦ త్వప్రభారూఢు

(634) డన మాను దేవన ♦ ననుమో వశిష్ఠ?
అను మను మని దేవ ♦ తాళులల్లాడ

(635) ననుజూచి బ్రాహ్మ్యమీ ♦ నాటికి జెందె
మునిసింహా? రమ్మని ♦ ముంగిట జేర్చె

(636) కరమర్థిపూజించె ♦ గానన్ బ్రాహ్మణ్య
మెఱజేయజూడ నే ♦ నెన్నడుగాని

(637) ఉత్తమోత్తమముల ♦ నొనరింపదలప
నెత్తెఱంగులవారి ♦ కెనగును హక్కు

(638) నీచాత నీచత ♦ నృప తతి జొరగ
జూచుటపాపంబు ♦ శోచ్యంబుగాన

(639) నుత్తమవర్ణ ప్ర ♦ యోజనంబెఱిగి
సత్తపశ్శక్తితో ♦ సాధించినాడ

(640) పనియుత్తమస్థితి ♦ బరగగ నలయు
తనుజొచ్చు యత్నమం ♦ తటిది కావలయు

(641) కోరికలధమముల్ ♦ కొనసాగి యేమి?
కోరియుత్తమములు ♦ కొనసాగుదాక

(642) పూనిక లేకున్న ♦ బురుషార్థమేమి?
పూనిక సాధింప ♦ బురుషార్థ మవని

(643) నాపుట్టువున బ్రాహ్మ ♦ ణత్వ సిద్ధికిని
భూపనందన వేర ♦ పూర్వమా గాథ

(644) కలదంమువలననే ♦ గాంచగల్గితిని
కలుగకుండిన నొంద ♦ గడు దుర్లభంబు

(645) జనిహేతు వాదవశ ♦ ఝ్స్మదేవవృత్తి
జనపాల!యొరులకు ♦ సమకూరబోదు

(646) జననంబుగల్గియు ♦ సదమలవృత్తి
మనమునగొనినచో ♦ ముక్తియథఃప్రాప్తి

(647) అనిపల్కుమునివృత్త ♦ మరయుచురాము
డనుపమాన దపస్వి ♦ యని మది నెఱిగ

(648) నయబోధతోడ బు ♦ నః ప్రణామములు
భయభక్తులఁదాల్చి ♦ బాలురు జేయ

(649) భయదాటవులజొచ్చి ♦ పరతెంచుచున్న
సరయుదోడులను ముని ♦ సత్త్వముజూచి

(650) యటసుకేతుఁసుత ♦ యలజంభపుత్రు
పటుసత్త్వ సుందుని ♦ భార్య దుశ్చరిత

(651) మారీచమాత శుం ♦ భద్బలోపేత
ఘోరాసురవ్రాత ♦ కూహాకదోర్యుత

(652) పర్వతశిఖరాగ్ర ♦ పంక్తులు డుల్ల
నుర్వి కంపింపంగ ♦ నొకపెడబొబ్బ

(653) దద్దరిల్లగ బెట్టి ♦ దంతముల్ నూరి
పెద్దకాటుకకొండ ♦ ప్రిదిలినయట్లు

(654) ఖేటక మొకచేత ♦ గిరగిర ద్రిప్పి
నాటకమాడుచు ♦ నరమాంసమనుచు

(655) పచ్చినెత్తురులతో ♦ బంకిలంబగుచు
వెచ్చనియూర్పుల ♦ వేడి నెత్తురుల

(656) గ్రక్కుచు నిలునిలు ♦ కదలకు డనుచు
రక్కసి పెనుకేక ♦ రభసంబుజూప

(657) బడగూల్పు మోరామ ♦ భద్ర? యిద్దాని
నెడజేయ, గడుముప్పు ♦ లేర్పడు మనకు

(658) ననగ శ్రీరాము డీ ♦ యబలనుజంప
మనము నందొల్ల కా ♦ మాట దాననిన

(659) మునికోపమునుదాల్చు ♦ మోమోట మడగు
నని యిట్టులనియె నో ♦ యనఘ, మునీంద్ర?

(660) తమశిష్యుడిట్లు కాం ♦ తను ద్రుంచె ననిన
క్రమహీనమైమెగ్గు ♦ రాగలదేమొ?

(661) అలవశిష్ఠుని శిష్యు ♦ డబలను జంప
నలవడునేమొకో? ♦ యపకీర్తి ధరణి

(662) మను కులంబున కెల్ల ♦ మానిని జంప
దనరు దుర్యశమని ♦ తలకుచున్నాడ

(663) నా యపకీర్తికై ♦ నాకార్తి లేదు
వేయేల! నాకేమి ♦ పేఱు ప్రతిష్ఠ

(664) చిన్ని బాలుడ నెటో ♦ చేసిన మీకు
వన్నె తగ్గించిన ♦ వాడనుగాన

(665) అని చూచుచున్నాడ ♦ నన ముని మెచ్చి
కనుగొనె దిటులేల? కాకుత్స్థతిలక

(666) చేరువ కరుదెంచె ♦ జనకవ యోని
ఘోర నక్తంచరి ♦ క్రూర కరాళ

(667) కుహరంబులో జొన్ని ♦ గుటగుటభ్రమించు
మహనీయగుణ? మిమ్ము ♦ మమ్మునుగూడ

(668) ఆడుది యిదియని ♦ యనుమానముడుగు
పాడు మాంసాశన ♦ పంకిల హృదయ

(669) యెందరు మానుల ♦ నిది పట్టి భ్రమింగె
సందియ మందిన ♦ జంపును మనను

(670) లేలెమ్మటన్న బ ♦ ల్యోడి బాణమంది
బాలుడు శ్రీరామ ♦ భద్రుడు వింట

(671) బిగియించి విడిచిన ♦ భీకర శరము
పొగ లెగయఁగ బోయి ♦ పొరిబుచ్చె దానిఁ

(672) కొండ గూలినయట్లు ♦ కూలిన దాని
మొండెమ్ము వలు రక్త ♦ ముల గ్రక్క బారె

(673) రాక్షస ప్రాణ ని ♦ ర్యాణ నాటికకు
నక్షయ నాంది యి ♦ దైన దటంచు

(674) రామునిను గుణాభి ♦ రాముని బొగడి
సౌమిత్రితోడ రా ♦ జని ముని వేగ

(675) వయునం బొనర్చుచు ♦ బాలకులార?
నయదూర యాదుష్ట ♦ నరహంత్రి మడిసె

(676) దారమైనవాడు చా ♦ తుర్వర్ణ్యరక్ష
సరణి దప్పక జేయు ♦ స ద్వ్రతదీక్ష

(677) పాపచిత్తుల నెంత ♦ ప్రజలల హింస
బ్రాపించినను క్షత్ర ♦ పరమధర్మంబు

(678) ధరదండ్యులైన న ♦ దండ్యులే యైన
దురితమే యైన దు ♦ ర్దోషమే యైన

(679) తత ప్రజారక్షణ ♦ తత్పరత్వమున
ధృతి నెట్టిహింస సం ♦ ధించిన రాజు

(680) నయమూర్తియనడె? స ♦ నాతన మనువు
శ్రయరాజకార్య ని ♦ ర్వాహకత్వమున

(681) నిలకెగ్గొనర్చుచు ♦ హేల జరింప
నల విరోచనసుత ♦ యైన మందరను

(682) జక్కాడడే? మున్ను ♦ శక్రుడీలీల
నకార్యమాత భృ ♦ గ్వాంగి నణచె

(683) ద్రోయగరాని దు ♦ ర్దోషముల్ జేయు
న్యాయమేనని యాది ♦ నారాయణుండు

(684) మలదకరూశ ని ♦ ర్మల దేశ సీమ
లిల శవమయములై ♦ యిట్లాయెనయ్య

(685) తమదయవలన నీ ♦ తాటక గూలె
మమతత్తో బుణ్యాశ్ర ♦ మములు కాగలవు

(686) రాజనందన? యన ♦ రాము డానంద
తేజోనిమగ్నుడై ♦ ధృతి కొంత నడచి

( సిద్ధాశ్రమము )



(687) మాని యీ పుణ్యాశ్ర ♦ మమ్మును జూడ
మానసమరుదందె ♦ మమత బెంపొందె

(688) సురపొన్న గున్నల ♦ జుట్టిన ద్రాక్ష
పరిపక్వ ఫలయుత ♦ వల్లు లివేమి?

(689) పనస రసాల చం ♦ పక నారికేళ
ఘనపూగ రంభాది ♦ క్రమ వృక్షములు

(690) శీతలచ్ఛాయల ♦ జేతముల్ దనుపు
వాతపోత విహార ♦ వర్తనలేమి?

(691) సైకతస్థలు లేమి? ♦ జలరుహ భృంగ
కోకిల హంసాది ♦ కూజితం బేమి?

(692) భవదీయ సవన భూ ♦ భాగమెందొదవు
వివరింపుమన ముని ♦ వీరు డిట్లనియె

(693) శ్రీరామ? యిదియె మా ♦ సిద్ధాశ్రమంబు
మీరదితికిని జ ♦ న్మించిన చోటు

(694) వామనాశ్రమమను ♦ వాడుక గలదు
తాము విరోచన ♦ తనయు నణంప

(695) ప్రేమవి యచ్చర ♦ శ్రేణి బాలింప
భూమిన వెలసిన ♦ పుణ్య ఫలంబు

696) బలి యజ్ఞ విఘ్న ప్ర ♦ భావంబదెమొ
బలివంశజులు మహా ♦ బలయుతులగుచు

(697) భగవ దధ్వరముల ♦ బాడొనరింప
మగటిమినిచ్చోట ♦ మణిగియున్నార

(698) లన రాఘవేంద్రుడి ♦ కాలస్యమేల?
ధనువు నశరమెత్తి ♦ తమ్ముడా నీవు

(699) సవనశాలాద్వారం శాఖల నిలువు
మవలోకన మొనర్తు ♦ నంతట నేను

(700) చీమ చిటుక్కన్న ♦ శ్రీరామబాణ
భీమసంరంభంబు ♦ పీచ మడంచు

(701) నన ముని మునికోటి ♦ నఖిల ఋత్విజుల
గనిపూనుడన రఘు ♦ కాంతు డిట్లనియె

(702) పరమపావనులార? ♦ బ్రహ్మర్షులార?
సరణి యజ్ఞంబిక ♦ సాగింపు డనిన

(703) ఘోర రాక్షసభయా ♦ కులులు ఋత్విజులు
నారాయణా? యని ♦ నలుదెసల్ జూచి

(704) గడగడలాడుచు ♦ కడలంట గనుచు
బుడుతలు వీరేమి? ♦ బ్రోవగాగలరో!

(705) సంకల్పమొక్కటే? ♦ సాగదు మఖము
జంకొందుటిదియేల? ♦ జావొనగూడు

(706) మానడీ మునివారు ♦ మాంత్ర మాగుదుర?
ప్రాణావసాన మే ♦ ర్పడు మున కనుచు

(707) నగ్నయే యని పెద ♦ వాడించుసంత
నగ్ని యెల్లైన ♦ గ్రోధాగ్నిరగిల్చి

(708) పాపిని శాటులు ♦ ప్రాప్తింపగలరు
శాపాయుధులమన్న ♦ జక్కాడ విడరు

(709) ఏమి? గాధేయ? నీ ♦ యిష్ట మేమనిన
రాము డిట్లనె ముని ♦ రాజులతోడ

(710) బాలుడు వీడను ♦ భయమొకో? ప్రళయ
కాలుడ నేను రా ♦ క్షసకోటికెంచు

(711) గురుని యనుగ్రహా ♦ కూపార బలము
వరలిన నేనేల? ♦ పదపాంసు వదుము

(712) శాలాప్రవేశంబు ♦ సమకూర్పు డనిన
లీల కౌశికముని ♦ లేఖారి భీతి

(713) యేలేశమును లేను ♦ హేలతో జరుగు
బాలుడేటికి? రాము ♦ పదధూళి చాలు

(714) సకల రాక్షస చక్ర ♦ సంహారమూర్తి
నికటాధ్వర స్తుత్య ♦ నిగమగోచరుడు

(715) రండు రండని శిష్య ♦ రత్నముల్ మునులు
తండోప తండముల్ ♦ ధైర్యంబుదాల్చి

(716) యాగశాలాంతర ♦ హవన వేదికల
బాగొప్పవసియించి ♦ ప్రస్తోతృసామ

(717) మాశ్రావయ యటంచు ♦ నధ్వర్యు డనగ
సుశ్రావ్యముగ నిక ♦ స్తుశ్రౌష డనుచు

(718) కేవల భక్తి నా ♦ గ్నీధ్రుండు బలుక
పావనహోత శు ♦ భ స్వనంబలర

(719) ఏయజామహే యని ♦ యింద్రాది సురుల
నాయాశ్రుతి స్తుతు ♦ లలరించి పిలువ

(720) ఉద్గాత సామవే ♦ దోచ్చారణమున
నుద్గమ సామంబు ♦ లొనర విన్పింప

(721) స్వాహా వషట్కృతుల్ ♦ సమకూర్చి గవ్య
మాహుతాశనున కై ♦ యర్పించుచుండ

(రాక్షస వధ)



(722) చనిన తాటక వార్త ♦ సైరింపలేక
విని తాటకాత్మజుల్ ♦ వేలకు వేల

(723) దనుజులతో వచ్చి ♦ దర్పమే పార
ముని యజ్ఞశాల నా ♦ మున ప్రవేశింప

(724) పలల వర్షంబు లు ♦ ప్పరమునం దుండి
శిలలతో గుఱిపించి ♦ చెలరేగి పెలుచ

(725) కారు చీకట్లు మొ ♦ క్కలముగ గ్రుమ్మ
వారు శ్రీరాముని ♦ భక్తి నుతింప

(726) శ్రీరాము డచట రా ♦ త్రించరాధముల
ఘోర వికారముల్ ♦ గోరంత జూచి

(727) అగ్నేయసాయక ♦ మరి గుఱిజేయ
భగ్నులై త్రెళ్ళి సు ♦ బాహు డగ్రమున

(728) వాయవ్య శర మొక ♦ పాటిగా లాగి
వేయ మారీచు డా ♦ వేగంబుతోడ

(729) శత యోజనాయత ♦ ఘోర వారాశి
మతి దప్పి పడె ♦ మహా మైనాకమనగ

(730) ప్రాణంబు లెట్టులో ♦ బరగె దేహమున
బ్రాణదాన మొనర్చె ♦ రాముడే ననుచు

(731) రామనామము విన్న ♦ రాత్రియు బవలు
రాము బాణంబుగ ♦ రహి భీతిదాల్చు

(732) నిర్రితి వారిద్దు ♦ రేగిన పిదప
ధీరత చెడిరి రా ♦ త్రించరాధములు

(733) చచ్చినవారలు ♦ జనిరూర్ధ్వగతికి
నిచ్చల రాక్షసు ♦ లేగిరి దెసల

(734) దానవహతకులం ♦ దఱ్ఱమంద జేయ
మౌను లధ్వరము స ♦ మగ్ర మొనర్చి

(735) యవబృథ స్నానంబు ♦ లాదు శ్రీరాము
నవనీశ్వరు డటంచు ♦ నభిషేకమిచ్చి

(736) దానుపచారముల్ ♦ ధన్యతజేయ
సౌమిత్రియుతునిగ ♦ స్వాగతముడగ

(737) సోదరు లిద్వరు ♦ జోడించి కేలు
మీదయ యింకేమి? ♦ మీయాన లనిన

(738) పరమాశిషంబిచ్చి ♦ బహువేదనాద
సురుచిర గీతముల్ ♦ సుఖమొప్ప వినిచి

(739) కాపాడితివి మమ్ము ♦ కల్యాణరామ!
కాపాడు మఖిలంబు ♦ కాకుత్స్థరామ

(740) అచిరమే కల్యాణ ♦ మగుగాక మీకు
రుచిర యశస్సు నా ♦ రోహింత్రుగాక

(741) అని మంగళాశీస్సు ♦ లందించి మిత్రుల
వినయంబుతో స్తోత్ర ♦ విధు లొనర్పంగ

( మిథిలా ప్రయాణము )

(742) గాధేయు డంతట ♦ గనుగొని రాము
మైథిలీపరిణయ ♦ మంటపమును

(743) జనకరాజేంద్రుని ♦ సత్యప్రతిజ్ఞ
ఘన హార కార్ముకా ♦ కర్షణ హేల

(744) విని చనుదెంచిన ♦ వివిధ రాట్పుత్రులు
ధనువునల్గన జూచి ♦ తమపని గామి

(745) వెనుకకు జనుదెంచు ♦ వేడుకలెల్ల
కనులారగాంచి వి ♦ క్రమమున దాని

(746) నెక్కిడి జనక రా ♦ జేంద్ర నందనను
మక్కువ బెండ్లాడి ♦ మఱలంగ గోర్కె

(747) పయనంబటన్న భూ ♦ పాల నందనులు
రయ మొప్పగను ధను ♦ ర్ధారులై వెంట

(748) జనుదెంచుచుండ వి ♦ శ్వామిత్రమౌని
తనజన్మదేశ వృ ♦ త్తాంతముల్ వినిచి

(749) మునులతో జహ్నునాద ♦ ములతోడజహ్ను
తనయకుదగ్గిర ♦ ధన్య హిమాద్రి

(750) దరిజేరి దివ్య ప్ర ♦ దక్షిణ వృత్తి
తిరిగి శోణానదీ ♦ తీరంబు జేరి

(751) తటచరిత్రము వేడ ♦ తత్తదాఖ్యాన
మట విస్తరించుచు ♦ దన్మధ్యమందు

(752) కుశనాభుడు ఘృతాచి ♦ కోమలియందు
శశిముఖ శతమును ♦ సంతానమంద

(753) పవనుండు వారి వి ♦ వాహ మాడుటకు
గవయనుంకించిన ♦ కన్యాలలామ

(754) అఖిల ప్రాణులకెల్ల ♦ నంతరాత్మవుగ
సుఖమిచ్చు నీవు నీ ♦ చులబోలి యడుగ

(755) నీతి కాదనుచు దం ♦ డ్రి యనుజ్ఞలేక
నాతి పెండ్లాడిన ♦ నరకం బటంచు

(756) జనకుడో సంగక ♦ స్వచ్ఛందవృత్తి
వనిత స్వతంత్రించి ♦ వరు నపేక్షింప

(757) భర్తకా దాతడు ♦ భార్య కాదామె
నర్తకులని పురా ♦ ణములను ననుచు

(758) నదలించి తచ్చాప ♦ హాతి కుబ్జలగుట
బ్రదయత జనకు త ♦ పశ్శక్తి మరణ

(759) ఉచిరయౌవన వరా ♦ రోహాలై వారు
నచిరమె సుక్షుమా ♦ ధ్యక్షు పీఠమున

(760) కాలవాలంబులై ♦ యలరిన కథలు
తాలిమితో బ్రహ్మ ♦ దత్తుని జన్మ

(761) మాలోనగాధి వృ ♦ త్తాంతంబు మొదలు
బాలురతో దెల్పి ♦ పరమ హర్షమున

(762) జనకరాజేంద్రుని ♦ సత్పురిత్రోవ
జనిచని మఱికొన్ని ♦ శైలముల్ దాటి

(763) ఘనతరుగుల్మ దు ♦ ర్గహనముల్ గడచి
కనుపండువిడు నది ♦ కౌశికిదాటి

(764) సెలయేళ్లు దిలకించి ♦ చెట్లు వీక్షించి
వలనొప్ప పయనమై ♦ వచ్చుచునుండ

(765) నచ్చటగననయ్యె ♦ నాయభ్రగంగ
యుచ్చైఃపదాయాత ♦ యోగ్యతరంగ

(766) ప్రణుత మరుల్లోక ♦ పావన గంగ
ఘనపద్మ సంచర ♦ త్కమనీయ భృంగ

(767) గంభీర దివ్య సా ♦ గర మహాత్యంగ
జంభారిముఖదేవ ♦ చయ నాట్యరంగ

(768) కలహంసమాలికా ♦ కలితో త్తమాంగ
సలలిత భక్త ర ♦ క్షణ కృపాపాంగ

(769) నట్టిమహాగంగ ♦ నరుదందిచూచి
పట్టిన కేల్ ఫాల ♦ భాగంబు సోక

(770) నెట్టన మ్రొక్కి ము ♦ సీశ్వరుతోడ
నిట్టిటుల్ ప్రశ్నించె ♦ హేల రాఘవుడు

(771) గంగావతరణ ప్ర ♦ కార కారణము
లింగిత వేదివై ♦ హేలతో వినగ

(772) సగర భగీరథ ♦ జననాథ జహ్ను
భగవదారాధ్య యీ ♦ భాగీరథనుచు

(773) తమ్ముడు తానునెం ♦ తయు భక్తి నెఱిగి
ముమ్మరమగు ప్రేమ ♦ మున బల్కిరిట్లు

## (శ్రీ గంగాస్తోత్రము)



(774) జయ? హిమగిరిపుత్రి ♦ జాహ్నవీదేవి
జయ? లోకకల్యాణి ♦ జయము త్రివేణి

(775) జయలోకపావని ♦ జంతునిశ్రేణి
జయ సర్వమానవా ♦ శ్రేయణివారి రమణి

(776) రత్నాకరుని భాగ్య ♦ రాశివటమ్మ
నూత్నయత్నముల మా ♦ న్యలకిత్తువమ్మ

(777) జంతు సంతతుల బా ♦ జ్జన దాల్చినావు
పంతగించిన లోక ♦ పతితుల్య వీవు

(778) పతితులు నీ పేరు ♦ బలికినమాత్ర
పాతదోషులై యూర్ధ్వ ♦ మధివసించెదరు

(779) అడుగుబట్టినవారి ♦ నవలీలపైకి
వడిదేల్ప నీవంటి ♦ వారెవరమ్మ

(780) సగరపుత్రులను ర ♦ సా తలినుండి
నగరిపు పురిజేర్చి ♦ నావుగా తల్లి

(781) కపిలుకోపాగ్నిలో ♦ గ్రాగిన సగర
నృపనందనుల నుద్ధ ♦ రించినావనిన

(782) గొప్పేమి? బ్రహ్మాండ ♦ గోళంబిదెల్ల
నెప్పాటనైన నీ ♦ యేల్బడికాదె

(783) భాగీరథీ? గంగ? ♦ బ్రహ్మాండజననీ?
వాగీశ్వరేశ్వరి? ♦ పాపనిహంత్రి

(784) అభ్రకేశజటాని ♦ ర్గళావాస
శుభ్రజలోల్లాస ♦ సుందరహాస

(785) ఇపుడు వీచికలుగా ♦ వి విలోకజనని
నిపుణత దివి జేర్చు ♦ నిచ్చెనమెట్లు

(786) అలరారు కలహంస ♦ లవికావుతల్లి
బలిమి స్వర్గతి జేర్చు ♦ బంట్లుమాయమ్మ

(787) భవదీయ వీచికా ♦ పటలి రవంబు
చెవిబారు భాగ్యంబు చేకురెనేని

(788) యమ మహిషోగ్రఘుం ♦ టారావమింక
క్షమవినకింద్రుని ♦ సదనంబు జేరు

(789) నీగాలి బీల్చిన ♦ నీరాక్కకైన
భోగేంద్రు పదమైన ♦ భువి లెక్కగొనదు

(790) నీపేరు వినమాత్ర ♦ నిఖిలపాపములు
పోపలాయనమయి ♦ పోవునుగాన

(791) పాపంబులున్నట్టి ♦ భయమేమిలేదు
నీప్రార్థనముజాలు ♦ నిఖిలభూప్రజకు

(792) గంగేయటంచు నె ♦ క్కడనుండి యనిన
రంగత్తరంగవై ♦ రక్షింతువమ్మ

(793) పాపులు నరక కూ ♦ పములలో బడుట
భూపాలనమున కీ ♦ భువికి నీరాక

(794) చూపట్టనప్పటి ♦ సోదెలుతల్లి
వాపాటమై జనుల్ ♦ వర్ణించుచుంద్రు

(795) నిన్ను దలంచిన ♦ నిఖిల దోషములు
మన్నన గలియును ♦ మఱియేటి యముడు

(796) ఉచ్చైస్స్వరంబున ♦ నొకసారి నిన్ను
పిచ్చివాడైనను ♦ బిలచినయేని

(797) హెచ్చు లోకముల కీ ♦ వెక్కింతువంబ
ఇచ్చుట వెలయుట ♦ యిల భాగ్యమమ్మ

(798) జోహారుసురనదీ ♦ జోహారునీకు
జోహారునీహార ♦ శుభ శైల తరణ

(799) జోహారు లోకుల ♦ శోకముల్ బాపు
జోహారు నిన్నిట్లు ♦ స్తుతియింతుమాత

(800) ఈ భవత్ స్తోత్రంబు ♦ లెవరు పఠింప
నీ భక్తులనుచు గ ♦ ణించి రక్షించు

(801) కలుష నిహంత్రి గం ♦ గాస్తోత్ర మహిమ
మిలనెల్ల వేళల ♦ నింపెసలారు

(802) వనివేడి క్రుంకి పు ♦ ణ్యార్ఘ్యంబులిచ్చి
దినమణికధిక సం ♦ తృప్తిగావించి

(803) మనమున నానంద ♦ మగ్నులై వేగ
జననాథతనయులు ♦ సంయమీశ్వరుడు

(804) పరిసరంబుల బుణ్య ♦ వనములుగడచి
పోవుచు ముచ్చటదోప ♦ నారామమూర్తి

(805) చిన్ని తమ్మునిఁ జూచి ♦ చిత్రించినట్లు
లున్న భూరుహముల ♦ యున్నతిజూడు

(806) మని నిరూపించుచు ♦ నశ్వత్థసరళ
పనస బిల్వకదంబ ♦ పారిజాతములు

(807) జంబుజంబీరమాల్ ♦ సరస రసాల
రంభాది బహువిధ ♦ ప్రకట వృక్షముల

(808) వనసుమ శ్రేణి ♦ సానమ త్సుఫల
విసరంబుతో నున్న ♦ వింతపూపొదల

(809) కమలకల్హారాది ♦ కమనీయపుష్ప
రమణీయ పద్మాకర ♦ రములతో బొదలు

(810) తావులఁజూపి పూ ♦ తావులందించి
భావంబు దన్పెడు ♦ బాలవాయువుల

(811) సేవఁదేరుచు దన ♦ చెంతలక్ష్మణుఁడు
నాదరంబునఁజల్కు ♦ టూరయుచుండి

## అహల్యాశాప విమోచనము



(812) మునివెంటఁబోవురా ♦ మునిపాదధూళి
కానసోకి యొకశిల ♦ కోమలియగుచు

(813) పదియారువన్నె క్రొం ♦ బసిడి కఱంగి
నవమలాకారమై ♦ జానొప్పు కరణి

(814) వరనిమేషంబులో ♦ నావిర్భవించి
గురుతరభక్తి మ్ర ♦ క్కుఁ వరగుల్కొలఁపు

(815) పరమాద్భుతంబుగ ♦ బడములవ్రాలి
శరణని యీరీతి ♦ సన్నుతిజేసె

(816) శరణుపరంధామ ♦ సాకేతరామ
శరణంబుదశ్యామ ♦ సద్గుణారామ

(817) శరణు వైరివిరామ ♦ సంగ్రామభీమ
శరణు శ్రీరఘురామ ♦ జానకీరామ

పరమపావననామ ♦ పట్టాభిరామ
కరుణారసోద్దామ ♦ కాకుత్సరామ

(819) దరహాసజితసోమ ♦ దశరథరామ
వరయోగిజనకామ వైకుంఠరామ

(820) శాపావసానంబు ♦ సమకూర్చినావు
రూపుప్రసాదించి ♦ రూఢికెక్కితివి

(821) అధిప? లీలామాను ♦ షావతారమున
నఘములబరిమార్ప ♦ నరుదెంచెదనుచు

(822) శాపమోక్షంబు నీ ♦ చరణాబ్జరేణు
వీపట్లగావించు ♦ టిది కటాక్షించి

(823) గౌతమముని నాదు ♦ కాంతు డింపుండ
ప్రీతినాతని కేను ♦ ప్రియకుటుంబినిని

(824) నాతప్పు సైరించి ♦ నాకందు బాపి
పూతచరిత్రగా ♦ బొనరించినావు

(825) ధీరచరిత్ర వ ♦ త్నీదాన వీవు
కోరి గౌతమునకు ♦ గూర్చిన ఫలము

(826) వారకచేకూరు ♦ వాస్తవమనుచు
శ్రీరాముదీవించి ♦ స్థిరత నిట్లనియె

(827) అచిరమే మత్పుత్రు ♦ డగు శతానందు
డుచితజ్ఞుడై శుభ ♦ మొదవించు మీకు

(828) రూఢిమై జనకపు ♦ రోహితుడతడు
పాడిమై జానకీ ♦ పాణిగ్రహంబు

(829) గావించు నేనందు ♦ గాంచుడు నన్ను
నావిభుతో జేర ♦ నాకాజ్ఞ యొసగు

(830) మని పల్కిన యహల్య ♦ వాగ్లోక్తి కలరి
చననాజ్ఞయిచ్చిన ♦ జనియె నహల్య

(831) గౌతముసన్నిధి ♦ గార్హస్థ్యపదవి
పూతచరిత్రయై ♦ పొడమినుండె

(832) శ్రీరాముడాశ్చర్య ♦ చిత్తుడై గురుని
గారవంబున శాప ♦ కారణం బడుగ

(833) నన్నియు నెఱిగిన ♦ న్నడుగుచున్నాడ
వున్నది యెఱింగింతు ♦ నూకొను మనుచు

అహల్యా శాపక్రమము



(834) గౌతమాశ్రమమిది ♦ గౌతముడనిన
నాతత యోగవి ♦ ఖ్యాత తేజస్వి

(835) ఆతనికర్ధాంగి ♦ యతిసుందరాంగి
భూతలి నొప్పారె ♦ పొలతి యహల్య

836 ఈతన్వియౌవనం ♦ బీసతి సొగసు
బూత చరిత్రంబు ♦ బుద్ధి నూహించి

(837) శతమఖుడా కాంత ♦ సౌఖ్య మాశింప
పతిభక్తి యుతదేవ ♦ పతిని శాసింప

(838) వంచింపదలచి యా ♦ వాసవుడంత
పంచపంచోషస్సు ♦ బరగకమునుపె

(839) గౌతము పంచ నగడి ♦ కోడియగుచు
కూతర్థ రాత్రిలో ♦ కొక్కొరో యనుచు

(840) సవ్వడి జేసిన ♦ స్నానార్థ మపుడు
దవ్వులగంగ గా ♦ తముడు సేవించి

(841) స్నానకాలముగామి ♦ జాహ్నవి దెలుప
మానిమార్గముబట్టి ♦ మరియిల్లుజేరె

(842) వాసవుడమ్మునీ ♦ శ్వరుని రూపమున
మోసగించుకు నై ♦ మోహంబుగొలుప

(843) అలీలలనుమాన ♦ మాత్మనూహించి
వేళగాదిదియని ♦ వెలది గద్దించె

(844) నిజవృత్త మెఱిగించి ♦ నిశియిది నేను
భజనార్హుడను సురే ♦ శ్వరుడనటన్న

(845) ఏమిరా? ద్రోహి? శ ♦ చీంద్రుడవీవ?
కామించితివ? కండ్ల ♦ కావరమార

(846) పరమపతివ్రతా ♦ పటుశక్తి నీకు
గురుతుబెట్టెద నెఱుం ♦ గుమటంచు బలుక

(847) నంత గౌతమముని ♦ యరుదెంచి వేగ
కాంత యెవ్వడు వీడు ♦ కారణంబేమి?

(848) పడకటింటికిజొచ్చి ♦ ప్రయత్నించె ననిన
నడచిన కతలెల్ల ♦ నాతి వచించె

(849) నిజమెఱింగియు లోక ♦ నింద డిండింప
నజహారాదులు మెచ్చ ♦ నగుమిందు శిలగ

(850) శ్రీరాము పదధూళి ♦ చేత ద్రేతమున
సారసనేత్రవై ♦ జాయ గమ్మనియె

(851) పాకశాసన? యిట్టి ♦ పతిభక్తి జెనక
తాకబూనితివెంత ♦ దర్పించినావు

(852) త్రాచుబాములతోడ ♦ దగున? సెయాట
నీచ? పతివ్రతల్ ♦ నీకు మృత్యువులు

(863) యోనికాశించిన ♦ యోగంబుచేత
మేనెల్లయోనులై ♦ మెలగెదుగాక

(854) సతికదృశ్యస్థితి ♦ సమకూరునీకు
ప్రతి రోమమున గూడ ♦ ప్రత్యక్షమగును

(855) సాటివారలు నవ్వ ♦ సత్పతివ్రతల
కూటమాశించిన ♦ గూడినదనుచు

(856) వాడవాడలగర్వ ♦ వర్తన బాదల
జూడుమీశాపంబు ♦ సుత్రామనీకు

(857) అనునంతలో నదే ♦ హా మూలమిట్టి
ఘనవికారంబుగ ♦ గనుపింపరోసి

(858) కావరంబుడిగెనో ♦ గౌతమదేవ
నావిభవంబేడ ♦ నారూపమేడ

(859) దేవేరికిని నీకు ♦ స్థిరవియోగంబు
దైవయోగంబయి ♦ తగవిధి జొనిపె

(860) ఈ యేహ్యాభావంబు ♦ నెవరోర్వగలరు
న్యాయంతవానికం ♦ దరు నవ్వునట్లు

(861) జేయు టన్యాయంబు ♦ చేతులుమోడ్తు
బాయునట్లువరంబు ♦ బడయ ననుజ్ఞ

(862) యనముని కరుణించి ♦ యామర్మవితతి
కనులుగానితరులు ♦ గాంచ గన్పడును

(863) నీదృష్టికిట్టులే ♦ నీరోత చరిత
మోదంబుజెఱుచుచు ♦ మొనయుచునుండు

(864) ననుచునింద్రునితోన ♦ హాల్య శబ్దంబు
ఘనగోతమాభిద ♦ క్రమరహాస్యంబు

(865) లపవాదములడుల్చు ♦ సర్వజ్ఞకోటి
కిపుడు పశ్చాత్తప్త ♦ హృదయుడవైతి

(866) వరుగుమటన్న దా ♦ సోహామంచతడు
సురపురి జేరి య ♦ చ్చో సుఖముండె

(867) నారీతి శపియించి ♦ నది మొద లిచట
వారికాపురమిట్టి ♦ వైఖరి మారె

(868) నిర్జనారణ్యమై ♦ నేటికి గూడ
దుర్జనులకుచొర ♦ దుస్తరంబగుచు

(869) నతని తపోదీప్తి ♦ యాలరిన దయ్యె
సుతపస్వి గౌతము ♦ సుతుడు మనస్వి

(870) జనకమంటపమున ♦ సాక్షాత్కరించు
ననుచువారలుచేరి ♦ రానంద మెనగ

(871) జనకరాజేంద్రుని ♦ సౌభాగ్యనగర
మనియొప్పు మిథిల వ ♦ నాంతరసీమ

(872) జేరి యౌవనమున ♦ శృంగారమెల్ల
వాటక దిలకించి ♦ వరమునియాజ్ఞ

(873) సది మిథిలేశ్వరో ♦ ద్యానవనంబు
హృదయానుమోదమై ♦ యెసగు నిచ్చోట

(874) బొదలు పథిశ్రమం ♦ బును బుత్త్రమనుచు
నదనును వేచి వా ♦ రచట వసింప

(875) సదమల ముని తప ♦ శ్చర్య వర్తించె
విదితైందవ శిలాచ్ఛ ♦ వేదికపైన

వనవిహారము

(876) శ్రీరామలక్ష్మణుల్ ♦ శీతల పవన
సౌరభంబుల కాత్మ సంతసమంది

(877) పరిమళజలపూర్ణ ♦ పద్మాకరముల
సరణిదప్పక నాడు ♦ జలజంతు తతుల

(878) కుసుమ పల్లవ గుచ్ఛ ♦ కోరక భరిత
వసుమతీ స్థలముల ♦ వర్ణించి చూచి

(879) మల్లెలు మొల్లలు ♦ మఱి జాజి విరులు
ఫుల్లారవిందముల్ ♦ పూగనారంగ

(880) నారికేళ రసాల ♦ నవపక్వ పనస
భూరుహా వకుళ ప్ర ♦ భూత కపిత్థ

(881) రంభాది ఫల మహా ♦ రామ మధ్యమున
జంభారి మణి శిలా ♦ శకల వేదికలు

(882) జాబిల్లిరాల అ ♦ చ్చలు పొదరిండ్లు
ప్రాబల్యముగ నొ ♦ ప్ప పవడంపు టరుగు

(883) లలవజ్రమణిమయ ♦ హార్మ్య సోపాన
ముల చతుర్ద్వారముల్ ♦ ముచ్చటగొల్ప

(884) కలయఁబూచిన మల్లి ♦ కలు మొల్లలెల్ల
లలిజాతిజాతుల ♦ లంకారమిచ్చు

(885) రాజమార్గంబు లా ♦ రామాన జూచి
భూజోన్నతచ్ఛాయ ♦ పురుషోత్తముండు

(886) తనదేహ కాంతి కెం ♦ తయు దీసిపోని
ఘనశాద్వలస్థలి ♦ గాంచి యందుఁబడి

(887) సౌమిత్రి? యీవన ♦ స్థలిహరాయల్ జూడ
రామణీయకమద్ది ♦ రా? యనిపించె

888) రాజకౌస్తుభ గృహా ♦ రామమో? యే మొ
ఆజనకాధీశు ♦ డానందమూర్తి

(889) ప్రకృతియొందరసిన ♦ ప్రతిచోటగూడ
దకతక నర్తించి ♦ తాండవంబాడు

(890) కాలమూంత్రికుకని ♦ కట్టుతో నోరుల
గాలుచు పని మాని ♦ కణుకులై యగ్ని

(891) గోళంబులున్నట్లు ♦ కొమరొప్పబూచి
చాలు గన్పడు వలా ♦ శముల గాంచితివె

(892) ఇటికవా యజ్ఞేశ్వ ♦ రేంధనంబులుగ
వివిధమునుల్ శ్రుతుల్ ♦ విధియించు సమిధ

(893) లనలక్ష్మణుండురా ♦ మా? యటుజూడు
కనవేడుకయ్యెన ♦ క్కజమయి తోచె

(894) నాకు రాలిన చెట్ల ♦ కభి మంత్ర మిచ్చు
జోకపక్షులు కూయు ♦ చును జుట్టితిరుగ

(895) నుదయించెనోయన ♦ నొగి ప్రవాళములు
బొదలుచున్నవి మహా ♦ ద్భుతమిది కాదె

(896) యనవిని రఘురాము ♦ డటుజూడు మనుజ
కనుపండు వొదవింప ♦ గల్గ పూబొదల

(897) రొదలొదవించుచు ♦ రోలంబరాజి
మదికనూనానంద ♦ మహిమ బెంపొంద

(898) మంగళగాన సా ♦ మ్రాజ్యమీాదనిసి
పొంగుచు దలలూచు ♦ భూరుహా వితతి

(899) కొమ్మల గొమ్మని ♦ కోమలపల్ల
వమ్ములం బరముల ♦ పగిది నర్పించి

(900) ఫలదానములు ద్విజా ♦ వళికుపాయనము
లలవోక నందించి ♦ యల గాయనులకు

(901) తేనియ విందు లెం ♦ తే సమర్పించి
పానీయ శాలల ♦ ప్రబలించి నేటి

(902) మాధవు డిచట ర ♦ మాధవు రీతి
సాధీయ వనరమా ♦ సామ్రాజ్యపాణి

(903) కంకణంబును గట్టి ♦ కాల్ ద్రొక్కకంటె
కంకేళులు వసంత ♦ కార్యంబులెల్ల

(904) జంకక కావించు ♦ జక్రవాకములు
నింకరాయంచ లి ♦ వే కాంచుడనుచు

(905) వనలక్ష్మి చైత్రుని ♦ వాహా ప్రశంస
ననుచల చిత్తుగ ♦ నయమారజేసె

(906) జటివెంట నవబ్రహ్మ ♦ చర్యాశ్రమమున
నటియించు మనమేడ? ♦ నవ్య కల్యాణ

(907) రసనం౹పదాయు వ ♦ ర్ణనములి వేడ?
సునమయార్థంబుగ ♦ జొప్పడ వనుదు

[ సీత చెలులతో కాళీపూజ కరుదెంచుట ]



(908) కలహంస కూజిత ♦ క్రమ గాత్రములు
లలితమంజీర వి ♦ లాసమానడల

(909) దివ్యబాలిక లరు ♦ దెంచు చున్నట్లు
నవ్య శ్రుతికి దోదె ♦ నరనాథ? మనము

(910) పొదరింటిలోనుండి ♦ పూబోణు లెవరో?
ముద మొప్ప జూచుట ♦ ముఖ్యమాదమ్మ

(911) నన్న? సౌమిత్రి? సూ ♦ ర్యాన్వయాయులము
సన్న సన్నల పర ♦ సతుల వీక్షింప

(912) కన్నులు బురికొల్ప ♦ కాని కార్యంబు
చన్నె? మనుస్మృతుల్ ♦ శాసించు మనల

(913) మనతాతముమి మమ ♦ మానవనేత
అనఘు డాతని చట్ట ♦ మది తలకట్టు

(914) మనకేల? మనునీతి ♦ మానవాళికిని
మనుమార్గ మెల్లరు ♦ మనుమలేకారె

(915) తద్ధర్మ్మముల నధ ♦ స్థము జేయ నెట్టి
బుద్ధిమంతుడు కీర్తి ♦ బొందుట కల్ల

(916) మనువనుభవశాలి ♦ మనుశాసనములు
మను మానవులకు ప్ర ♦ మాణ భూతములు

(917) ననుభవవేద్యంబు ♦ లగ్రగణ్యములు
గనుక నన్యస్త్రీల ♦ కనులెత్తిచూడ

(918) వెడగుమార్గంబిద్ది ♦ విడువుమద్దాని
జడియగావలె రాజ ♦ జన నిందకెందు

(919) నన లక్ష్మణుండను ♦ నన్నయ్యా? నేను
వినిచిన యర్థంబు ♦ వేరున్నదయ్యా

(920) జనకేంద్రు వనమిది ♦ జానకీమాత
దనయుని నట జూడ ♦ దవమును వీక్షింప

(921) జెలికత్తియలతోడ ♦ జేరునో యేమొ?
కలుగు కృతార్థత ♦ కన్నులకనుచు

(922) పలికితినన లజ్జ ♦ పైపయిబొదల
గల శివధనువు నం ♦ కల్పార్థసిద్ధి

(923) కొదువగానుండ నే ♦ కోమలులైన
మది పరవనితలు ♦ మనకు వారనిన

(924) సదమల ప్రజ్ఞతో ♦ సౌమిత్రి పలికె
పద? రాము? గాధేయు ♦ పట్టువమ్మగునె

(925) జృంభకాద్యఖిలాస్త్ర ♦ జేగీయమాన
సంభూత మాంత్రిక ♦ శక్తి వమ్మగునె

(926) ప్రీతయై దీవించి ♦ ప్రేమ దూకించు
గౌతమాంగనవచో ♦ గరిమ వమ్మగునె

(927) శాంభవ ధన్వంబు ♦ జ్యావల్లి గూర్ప
సంబోధి వలయితా ♦ నన్య సామ్రాజ్య

(928) గురు నృపాఖండలుల్ ♦ కోటానుకోట్లు
దరిజేర వచ్చిన ♦ దర మెటులయ్యె

(929) ఇన్ని కారణముల ♦ నే తెంచుకన్య
కన్నులకానంద ♦ కారణం బేమొ?

(930) చిన్ని మాజననియా ♦ సీతమ్మయేమొ?
అన్న? కన్గొందమా? ♦ యంటె నటన్న

(931) నానందపారవ ♦ శ్యంబు మైసోక
భూనాథుడొండన ♦ బుద్ధిపై జనక

(932) నుండినయంతలో ♦ నో చెలులార?
రండిది త్రోవ రా ♦ రాజకుమారి?

(933) యని మార్గదర్శిను ♦ లైన నెచ్చెలుల
ననుసరించుచు జాన ♦ కాంబ విచ్చేసె

(934) తమ్మునితో రామ ♦ ధరణీశు డనియె
సమ్మతి లక్ష్మణా? ♦ సత్యసంకల్ప

(935) నీయూహ సకలంబు ♦ నిక్కువమాయె
నీవెలనాగల ♦ హేలలు గనెద

(936) మనిపొంచియుండ వా ♦ రట బ్రవేశించి
చనుచుండ నొక్కతె ♦ జానకి జూచి

(937) రాజమరాళమో ♦ రాజీవగంధి
నీజత కాల్ ద్రొక్క ♦ నిలిచె చూచితివె

(938) యననింక నొకతె యే ♦ మచ్చెరువమ్మ
మును కీరరాజంబు ♦ ముంజేయి పట్టె

(939) కాలుద్రొక్కుటతోడ ♦ కంకణబంధ
మీలతాంగికి మన ♦ యెదుట చేకూరె

(940) పాణిగ్రహోత్సవ ♦ ఫల దానములకు
నాణెయ మీవేళ ♦ నయమతినొదవె

(941) ననిపల్కు చేడియ ♦ లనుజూచి సీత
నను గేలి సేయుచు ♦ నవ్వెదరేమె?

(942) రాయంచనడనేర్పు ♦ రాత్రింబవళ్ళు
డాయవచ్చుటకేర ♦ డంచేమొ? మీకు

(943) రాజకీరంబు తా ♦ రకనామ మంత్ర
రాజంబు వినుచ క ♦ రంబెక్క దొసగె

(944) నిన్నటి పారంబె ♦ నేడప్పగింప
సన్నకీరము రామ ♦ శబ్దంబు వినిచె

(945) చాలు మీసరస మీ ♦ సారి యిట్లన్న
కోలు పెట్టెద మీదు ♦ కూరిమి యనిన

(946) కోపమింతేలనే ♦ కువలయనేత్ర
భూపనందనవు రే ♦ పో? మాపొ? వరుని

(947) పాణిగ్రహంబౌదు ♦ పను లగుచుండ
రాణివి నిన్నన ♦ రాదటవే? మాకు

(948) లీలావనంబిందె ♦ లీలలటన్న
బాలవాక్యములెకా ♦ పద్మాయతాక్షి

(949) యనునంతలోనరా ♦ మానుజుడౌనె
జనని కెంతటి ముద్దు ♦ చానవే? నీవు

(950) భావగంభీరంబు ♦ బాలల వాక్కు
దేవుడిందెట్లు చి ♦ త్రించి జంటించె

(951) రాజమరాళమా ♦ రామంబు జేర
రాజముఖి? బ్రహ్మ ♦ వ్రాత·కన్గొనితె

(952) రాజక్షీరంబు తా ♦ రక రామనామ
మోజర హాస్యంబు నుంచెనో చెవిని

(953) ముద్దుక్షీరంబిది ♦ ముంజెయ్యి నెక్కు-
టద్దిరా? పరమ ర ♦ హాస్యమిమ్మదనియెఁ

(954) అనితలపోయుచు ♦ హార్షాశ్రురోమ
మనుసరింపగవార ♦ లాదుండి రపుడు

(955) భూజాత కోపము ♦ ష్పాడె సాంతముడిగి
సాజమా వాత్సల్య ♦ సరణినిట్లనియె

(956) తప్పదిగాకున్న ♦ దావిన్నయపుడు
హెప్పాగ్రహాస్ఫూర్తి ♦ మీరదా యేమొ

(957) అనుచువారన్యోన్య ♦ హాస్తాంబుజముల
గొని యూతముల బెసం ♦ గునసందు దిరిగి

(958) తెలిద్రాక్షతీవపం ♦ దిళ్ళకెక్కించి
లలి యేలకుల తీవ ♦ లనుమ్రాన్ల జుట్టి

(959) మల్లికలల్లించి ♦ మరి మొల్లతీవ
లల్లసంపెంగల ♦ కాశ్రయమిచ్చి

(960) రాయబూచినపుష్ప ♦ రాశితీవియల
నా యవనిజయు బు ♦ ష్పాపచయంబు

(961) చెలులతోఁగూడితా ♦ జేయగన్నడమి
జలుతీవియలరామ ♦ భద్రుడిట్లనియె

(962) పల్లవంబనినసం ♦ పల్లవమయ్యె
పల్లవాధరహస్తు ♦ పల్లవశ్రీల

(963) కోరకంబనినని ♦ కోరకంబయ్యె
కోరకదంతప ♦ ల్కుదిరికకెదుర

(964) స్తబకంబులనిన న ♦ స్తబకంబులయ్యె
స్తబకవక్షోరుహా ♦ చక్రాంగకముల

(965) దేహంబటన్న సం ♦ దేహమే త్రోచె
దేహలావణ్యవై ♦ దేహి సన్నిధిన

(966) సర్వాంగముగనోడి ♦ జానకినింక
గర్వించి కన్నుల ♦ గానరాకుండ

(967) జేయుచున్నారుగా?సిగ్గేల లేదు
మాయురే? యోడిన ♦ మఱి తలలెత్త

(968) ననుచుండ బూవుల ♦ నటసేకరించి
చనిరనంటులుగల ♦ చక్కికచ్చోట

(969) కప్పూరపుటనంటి ♦ కడలబోదియల
తెప్పలైయుండిన ♦ దివ్యకప్పూర

(970) మప్పడంతులతోడ ♦ నవనిజమెత్త
మెప్పూర గని రామ ♦ మేదినీశ్వరుడు

(971) దివిజేంద్రమణి గణ ♦ దీధితిబోల్చు
నవ కదళీదళాం ♦ తరముల దిరుగు

(972) జానకీరమణి సా ♦ తూ స్మేఘపంక్తి
లోన చంద్రికయయి ♦ లోచనద్వయము

(973) దనియించుచున్నది ♦ తమ్ముండా! యనుచు
మనమున నానంద ♦ మగ్నులైయుండ

(974) జనకనందన చూత ♦ జంబీర పనస
ఘనదాడిమీబీజ ♦ ఖర్జూర కదళు

(975) లల ద్రాక్ష నారికే ♦ ళాదులతోడ
చెలికత్తియలగూడి ♦ స్థిరతరభక్తి

(976) దుర్గాలయమున సం ♦ తోషంబుతోడ
భర్గాంగనే! యని ♦ ప్రస్తుతి జేసి

(977) ఆవాహనాది పూ ♦ జావసరంబు
లేవిధి దప్పక ♦ యొసగించి యంత

(978) నీరాజనక్రియల్ ♦ నియతిసాగించి
పూరించి నుతిమంత్ర ♦ పుష్పంబు బెట్టి

(979) వికసిత శతపత్ర ♦ వివిధ పుష్పములు
సకలేశ్వరికొసంగ ♦ చాలకేలంది

[ దుర్గాస్తుతి ]

(980) స్తుతియించిరిట్లని ♦ తోయజముఖులు
ప్రతిలేని వాక్సుధ ♦ పైపయిఁగమ్మ

(981) జయ జయ భర్గాంగ ♦ సంసర్గ దుర్గ?
జయజయ యార్తార్తి ♦ శమన నిసర్గ?

(982) జయ లోకకల్యాణి ♦ జయ నీలవేణి
జయచండముండాది ♦ శత్రుసంహారిణీ

(983) జయమాహిషోన్మూల ♦ శక్తిప్రతాప
జయ రక్తబీజ దు ♦ ర్జయ దేహదళన

(984) బ్రహ్మాదిసర్వసు ♦ పర్వసంస్తుత్య
జిహ్మాసురవ్రాత్య ♦ శిక్షణానృత్య

(985) ఘనదయారసధునీ ♦ కల్లోలమాల
కనదమూల్య కుసుంబ ♦ కమనీయచేల

(986) దాడిమీకుసుమ మా ♦ ర్దవ దివ్యదేహా
క్రీడావిస్మితా ♦ ఖిలకళోత్సాహా

(987) కాపాడవే యమ్మా? ♦ కలుష సంహారిణి
నీపాదమే మది ♦ ? నెఱనమ్మినాము

(988) భూపాలనందను ♦ భువనమోహనుని
జూపవే? మాయమ్మ ♦ శుభదృష్టినిమ్మా

(989) ఆనునంతలోనను ♦ గ్రాంబయు కౌశిక
ముని తపో నియతినో ♦ ముద్దులబాల

(990) లనుసన్నుతులగల ♦ హర్షంబుతోనో
వినిపించెనిటులు ♦ వేగమీవనికి

(991) తారకబ్రహ్మమై ♦ దశరథేశ్వరుని
కూరిమిపుత్రుడై ♦ ఘోరరాక్షసుల

(992) శాసింపవచ్చిన ♦ జయరామమూర్తి
వాసిమై జానకీ ♦ వల్లభుడగుచు

(993) పాణిగ్రహణమందు ♦ వచ్చె సౌమిత్రి
మానినిగాధేయుని ♦ మాటున గలదు

(994) శివ ధనుర్దళనబు ♦ శ్రీరామభద్రు
డవలీలగావించు ♦ ననుమాదమేల

(995) జను డేనుగూడ నా ♦ శాంభవధనువు
గొనువేళకాతని ♦ కోమలబాహు

(996) యుగళంబులో జేరి ♦ యుచ్చండమేరు
నగమైనయజగవో ♦ న్నతివిల్కుమూర్తు

(997) ననుచు తద్దేవియు ♦ నంతర్హితమ్యె
విని చెలు లానంద ♦ వీచి దూగాడ

(998) జనకజ శ్రీరామ ♦ చంద్రుడందుంట
వినిసాత్వికోదయ ♦ వివశాంతరంగ

(999) మున దేలి కన్నుల ♦ మురువ్వదూకించి
దననాథువీక్షింప ♦ దాను లోలోన

(1000) వేడుకగొనుచును ♦ వ్రీళులూరుకొనుచు
క్రీడాసఖు లేమి ♦ కేరడమాడ

(1001) దొడగుదురో?యని ♦ తోచి భీతిల్లి
యడరుసూచించుచు ♦ నవశత నెసగ

(1002) హర్షోదయంబున ♦ నాశంబరారి
శీర్షోదయంబయి ♦ శిశువయిరొదల

(1003) కర్షించిమించిసం ♦ కల్పభవాశ
ఘర్షించి సుమచండ ♦ కాడముల్ నూరి

(1004) యరిమురి గురిజేయ ♦ నా తొలి దశకు
పరితపించుచును సా ♦ ఫల్యంబుగనక

(1005) నవలమనస్సుంగ ♦ మామీద తలపు
లవలీల బైకొన ♦ నసియాడు సీత

(1006) వివశత గుర్తించి ♦ వేవేగ రాజ
భవనంబులో జేర్చి ♦ ప్రభుదంపతులకు

(1007) రామలక్ష్మణగాధి ♦ రాజనందనుల
గ్రామోపకంఠమా ♦ ర్గస్థితి దుర్గ

(1008) పలికిన పలుకులు ♦ బాలికల్ వినుచ
పులకాంకురములతో ♦ బొంగి భూజాని

(1009) సీతను ముద్దాడి ♦ చిరునవ్వు నవ్వి
నాతల్లి నీనోము ♦ నాభాగ్యమమ్మ

(1010) మాత కోరికదీరె ♦ మహిమ జేకూరె
భూతలి నాకంటె ♦ పూజ్యుండు గలడె

(1011) ఈనాడె సకల భూ ♦ మీశ నందనులు
సానందముగవచ్చి ♦ సభనిండిరనుచు

(1012) చెలికత్తెయలబిల్చి ♦ సీతనందించి
కలికి కలంకార ♦ ఘన భూషణములు

(1913) శృంగార మొనరించి ♦ శీఘ్రంబులోన
రంగారు సౌధాగ్ర ♦ రత్నవేదికల

(1014) మంగళలగ్నసు ♦ మప్రకాండముల
సంగతమాలికా ♦ క్షతలతో జేర్చి

[శ్రీరామలక్ష్మణగాధేయులకు స్వాగతము]



(1015) కనుచుండు డని పల్కి ♦ గౌతమపుత్రు
ననఘుశతానందు ♦ నపుడు బిలచి

(1016) శ్రీరామమూర్తికా ♦ శికునితోననుజు
డైరహించినసుమి ♦ త్రాత్మజుతోడ

(1017 నుపకంఠవనమునం ♦ దుండినవారు
సుపటుపటీర క ♦ స్తూరికామాల్య

(1018) మధుపర్కములమర్చి ♦ మఱి సేమమడిగి
మధురానులాపస ♦ ముచిత రీతి

(1019) కరుణదొలికించిస్వా ♦ గతశుభోదర్క
పరిణయాహ్వానసం ♦ ప్రార్థనల్ నెఱప

(1020) తానుబ్రార్థింపగ ♦ తానంను డేగి
మౌనిసన్నిధి రాకు ♦ మారుల జూచి

(1021) రాజీవదళనేత్ర ♦ రామ రావయ్య
రాజస్వాగతమిచ్చి ♦ రమ్మనియనిచె

(1022) సౌమిత్రి? ఇదో రాజ ♦ స్వాగతమంది
స్వామికార్యమునకై ♦ జనుదేర వలయు

(1023) గాధిరాట్పుత్ర? స్వా ♦ గతమందుమిదిగో
ఈధనురాకర్ష ♦ ణేచ్ఛ మీదయ్య

[ జనకసభ ]



(1024) తమతపశ్శక్తిచేతం ♦ తయుదుర్లభంబు
సమకూర్చునే దేవ? ♦ సరసిజాంసభాసన

(1025) ధన్యమైయున్నసీ ♦ తామహాదేవి
పుణ్యపాణిగ్రహ ♦ ణ్యృత కార్యదీక్ష

(1026) సమకూర్పనుంచిన ♦ శాంభవధనువు
తమకుస్వాగతమిచ్చి ♦ తరలిరమ్మనిమౌ

(1027) ననకసుల్ దెచ్చి త ♦ దర్ఘ్యగ్రహించి
జననాథసుతులతో ♦ సంయమివచ్చె

(1028) వినిదశగ్రీవుడీ ♦ విధమెల్లదెలియ
తనహితమంత్రులై ♦ తనరినయట్టి

(1029) శుకసారణులతోడ ♦ స్ఫుటమాయదాల్చి
చకచకరాముల ♦ కృష్ణగాధిసుతుల

(1030) రూపంబులనుదాల్చి ♦ సూక్షిమైమిథిల
భూపాలసభ పీఠ ♦ ములనధిష్ఠింప

(1031) మిగిలిన రాజులు ♦ మించిన వేడ్క
సొగసు గుల్కుచు సభ ♦ జూచుచునుండ

(1032) ప్రతిహారిజనుదెంచి ♦ భార్గవు పరశు
పతియత్నమున వార్త ♦ నంపె నటంచు

(1033) సందేశ పత్రిక ♦ జనపతికొసగ
వందే? జగద్వంద్య ♦ వరగురువర్య

(1034) ప్రమందితాఖిలరాజ ♦ మహనీయ తేజ
వందనముదెగొను ♦ భార్గవ రామ

(1005) దాసోహమనుచు వా ♦ ర్తాపత్రముంది
వ్యాసంబుదిలకించి ♦ పఠియించెనిట్లు

(1006) కొంకణవాసి భృ ♦ గు ప్రౌఢసూతి
బింకంబుతోఁదాల్చు ♦ ప్రియసాధనంబు

(1007) వరనృపాల కిరాత ♦ పరమ దుర్గహన
వరకుఠారంబైన ♦ పరశు వీరీతి

(1038) విను వార్తనంపె ♦ వివేక మేర్పడగ
జనక? నీయభిమత ♦ క్షత్రియ సుతున

(1039) కచిరమేనీకూతు ♦ నర్పింపుమేను
వచియింతు వేదోక్త ♦ పద్ధతితోడ

(1040) ధాత్రి దీర్ఘాయువు ♦ దవిలి వర్తింప
నాత్రంబుతో నీవి ♦ టా శివ ధనువు

(1041) పందెంబు నిడితివా ♦ బాగుగ నెఱుగు
మందరు వినుచుండ ♦ ననుచున్నదాన

(1042) భార్గవగురుధను ♦ ర్భంగ పంకంబు
దుర్గర్వమునువాప ♦ దోగగ జేతు

(1043) పరశుధారా నదీ ♦ ప్లవన వేగమున
పొరపాటు పనిజేయ ♦ బోవుదో? యే మొ?

(1044) అని శిరమూచి నా ♦ యందిట్టిగరుణ
మునునేమకలదు శం ♦ భువు ధనుస్త్రుటన

(1045) మలవడుదాదాక రో ♦ షాగ్ని రావలదు
ఇల ధనుర్జ్యావల్లి ♦ నెవడైన నలచ

(1046) కోవంబు నీవు గ్రౌ ♦ కొనవచ్చునప్పుడు
భూపాలసుతుడట్టి ♦ పోటరియున్న

(1047) మనస్స్నేహమున కన్య ♦ మార్గంబు వలదు
వెనుకటిరీతినే ♦ వేచుచున్నాఁడ

(1048) నమనంబులనుచు భూ ♦ నాథుండు వ్రాయ
క్రమముగ నావార్త ♦ గని భృగురాము

(1049) డగరె? జామాత బా ♦ హాగర్వమిఁకని
బుఱికొల్ప వ్రాసె కా ♦ బోలు నీవార్త

(1050) కానిమ్ము చూచెద ♦ కాఁగల పనులు
మాఁనుదురే యట్టి ♦ మానవులైన

(1051) అని సమయంబున ♦ కతఁడు కాంక్షించి
వినయవంతుల నందు ♦ వేఁగుంచె నిచట

(1052) జనకుండు దన సభా ♦ గ్రస్థానమెక్కి
తనగురులకు మ్రొక్కి ♦ దైవముం దలచి

[ధనురారోపణ సభ]



(1053) సాగర వేష్టిత ♦ సకలావనీంద్ర
భోగదేవేంద్రులా ♦ భూపతులార

(1054) పరభయంకర రణ ♦ ప్రౌఢ దోస్సార
నిరుపమ విజయులా ♦ నృపవీరులార!

(1055) వీర్యశుల్కంబుగా ♦ విఁచితి వినుడు
కార్యఖడ్గముదాల్ప ♦ గడగుదురేని

(1056) శివధనుర్జ్యాకృష్ట ♦ సిద్ధుడెవ్వాడో
భువినతండగు నాకు ♦ పూజ్య జామాత

(1057) ఎవడు ధన్వంబు నిం దెత్తగలేడొ?
దవిలి యాతనికిందు ♦ ధరణిజమాత

(1058) అనిపల్కుచుండ నా ♦ హార కార్ముకంబు
జనపాలునాజ్ఞ భూ ♦ జనుల సంఖ్యాకు

(1059) లరిగి వేగమె తెచ్చి ♦ యాస్థానపీఠ
స్థిరభక్తినిడి ప్రతి ♦ ష్ఠించినవాని

(1060) కౌరకెవ్వరేనియు ♦ గొంకెదదాల్చి
త్వరపడకుండిన ♦ ధరణీశుడనియె

(1061) ఉర్వీశమణులార? ♦ ఊరకో నేల
నిర్వీరమయ్యెనే? ♦ నిఖిల భూతలము

(1062, గర్వంబుగల్గిన ♦ ఘనపరాక్రమము
నిర్విఘ్నముగ సభ ♦ నెగడింపుడనిన

(1063) నొకడరుదెంచి యో ♦ హో? మనమాట
లకు లేవదనుచుదొ ♦ లంగుచువచ్చె

(1064) నింకొక డరుదెంచి ♦ యించుక దాకి
జంకయ్యనిధికొన ♦ సాగదంచేగ

(1065) నటుమీాద వేరొక ♦ డచ్చు టజేరి
పటుశక్తి కదలించి ♦ పనిబడదనుచు

(1066) పోఁఋపీఠమునుచ ♦ ప్పాడుజేయ కొక్క
నాయడమటియొక ♦ డరియేమి లెక్క

(1067) వేయేల? నాసతి ♦ వినుము మీాసీత
స్వాయిగ శాంభవ ♦ ధను వెత్తుచుంటి

(1068) కనుడని ప్రార్థింప ♦ గా సాహసించి
ధను వేమి కదలక ♦ తగ్గి లజ్జిల్లె

(1069) ఆపట్టు కాదునే ♦ నారసినాడ
చాప మెత్తెదనని ♦ జని యింక నొక్క

(1070) డూపుచూపుచు విసు ♦ వృదయించి లేచి
యే ప్రక్కవారల ♦ నీ క్షింపలేక

(1071) పీట పైలజ్జిల్లి ♦ బిగువూడియుండె
తాటోటువారికి ♦ తరము కాదనుచు

(1072) పాటించి యింకొక ♦ ప్రభుమణి వచ్చి
గాటంపు శక్తితో ♦ కదలించి చూచి

(1073) ఏటిధనుస్సు మీ ♦ కేమి? యీ వెఱ్ఱి
నాటకమిది యెత్తు ♦ నరులున్నవార?

(1074) కొండనెత్తుమటంచు ♦ గోమలినిత్తు
రండన్న సామెత ♦ రాజేంద్రుడుంచె

(1075) నిడికొనసాగదే ♦ నేగెదననుచు
నొదిగ నొక్కండింక ♦ నొక డరుదెంచి

(1076) కదలింపనేలేక ♦ కంపంబుదాల్చి
మదిఘోయు జనకు డీ ♦ మార్గంబు బట్టె

(1077) సీతకు పెండిలి ♦ శివవిల్లుబట్టి
భూతలివంచుట ♦ బొత్తుగాకల్ల

(1078) అని గొణుగుచు బోయె ♦ నవనీశు డొకడు
చనుదెంచి కదలింప ♦ జాలక మరలి

(1079) రాజనందనులన ♦ క్రమకార్యమునకు
నీజనకుడు పిల్చి ♦ యెగ్గొనరించె

(1080) పేరువున్నవారలీ ♦ పనికి రారనుచు
జరచురజూచుచు ♦ జొక్కి వంసిచె

(1081) వరలక్షణములెన్ని ♦ వందలో కలవు
సిరియు రూపు వయస్సు ♦ శీలంబు కులము

(1082) నరుదండ విద్దియు ♦ లందు ముఖ్యములు
పరమ మూర్ఖ మిటు నా ♦ ప్రశ్న మేలేను

(1083) చిరుతప్రాయంబెదో ♦ చెవిబారవచ్చి
మరలిపోవలసెను ♦ మూ? యనె నొకడు

(1084) లేవవేమని యువ ♦ లీల నొక్కండు
భూవరుకూర్మితో ♦ బూనికస్సేయు

(1085) నేను కన్నెతి వే ♦ నియు జూడబోను
మానితి నాకన్య ♦ మాట నేనొల్ల

(1086) నాకాశ లేదని ♦ నవ్వుచు బలికె
భూకాంతులిందరీ ♦ పోడిమినుండ

(1087) జానకి సఖులతో ♦ సౌధాగ్రమెక్కె
నానాథుడగు రామ ♦ నరనాథు జేసి

(1088) గురుతించి చూపక ♦ న్నోనుదాన ననిన
పరికించి రావణ ♦ బ్రహ్మకు కలన

(1089 విలసిల్లుమంత్రుల ♦ వీక్షించి రాము
డల లక్ష్మణుడు కుశి ♦ కాత్మజుడనుచు

(1090) పలుకుచు వారల ♦ ప్రక్కన జూచి
తొలకరి మేఘమై ♦ తోచు దేహమున

(1091) పచ్చని సెలువ ♦ వలెవాటు త్రిప్పి
ముచ్చటగానుండి ♦ ముద్దులు దొలుక

(1092) సౌమిత్రితో రహ ♦ స్యములాడి నవ్వ
రాము నాలోంచి ♦ రమణి యుదేమై

(1093) సభనఛేదంబుగ ♦ సవిత్రు వంశజులు
ప్రభవించి రిర్వురే ♦ ర్పడను టదెట్లో?

(1094) అనుచుండ దశకంఠు ♦ డాత్మలో నౌర
ధనువుతో శంకరు ♦ తనువుతో గంగ

(1095) వనితతో బర్వత ♦ ప్రభవతో గూడ
ఘనవృషప్రథమ సం ♦ ఘములతోడ

(1096) కైలాసమగలించి ♦ కటకటనూచు
నాలాఘు ముఁనేర ♦ నాకిది లెక్క

(1097) రామాకృతిన లేచి ♦ రౌద్రధనుస్స
భీమబలంబున ♦ బెనవ్రేసి కేలు

(1098) పటుసాహసంబున ♦ బైకటులెత్తె
చిటికంత కదలిన ♦ చేతులు దూర్చి

(1099) గిజగిజలాడుచు ♦ గీపెట్టిమాఱియు
విజయేచ్ఛ దిగుచక ♦ వ్రేగుననెత్తె

(1100) సందిళులఁ దూర్చి ♦ శాంభవ ధనువు
తొందరపాటుతో ♦ దోకొన కదలి

(1101) రొమ్మునకది పొల్లి ♦ యేఁజుచు గ్రుడ్ల
గ్రమ్మిన సింబు ♦ గార్పంగలేక

(1102) శ్వాసావరోధంబు ♦ సమకూర నచట
గాసి దీర్పగజాలు ♦ ఘనుమోడు లేమి

(1103) పాశమటంచు భూ ♦ పాలు రందఱును
పాపుష్టిధను వహో ♦ ప్రాణంబులూడు

(1104) వీని జానకియెంత ♦ వీడెంతరండు
దీనిపోల్లిరతము ♦ తీవ్రంబులోన

(1105) నాకరిర్వ్యరకు లేవ ♦ దూపిరిదియు
చకచక రండనుచు ♦ జనపతిసుతులు

(1106) తహతహపడ జూచి ♦ తపసి యిట్లనియె
బహుజనమందేల ♦ వలదని పలికి

(1107) ఇనవంశ రత్నమా? ♦ యికజూచె నేల?
ధనువందియెత్తి యీ ♦ తని బ్రతికింపు

(1108) దోషాచరుడు వీడు ♦ దుష్టుడు ప్రాణ
ఘోషలోనున్నాడు ♦ గొబ్బున లేమ్ము

(1109) ప్రతికింపుమన రాము ♦ భద్రుడు లేచి
యతికి దండంబిడ ♦ యటుజనబోవ

(1110) పలెవాటుసవరించె ♦ భక్తి సౌమిత్రి
లలిరామమూర్తి వి ♦ లాసమేపార

[ శివధనుర్భంగము ]



(1111) మందహాసంబున ♦ మగటిమిదోప
సుందరాననముము ♦ సుంగున గప్పి

(1112) చిన్నికూకడాలతో ♦ జేరికేల్దోయి
సన్న సన్నల దూర్చి ♦ శాంభవ ధనువు

(1113) కరి యిక్షుఖండబు ♦ గైకొనులీల
కరమున ధరియించి ♦ గాథసారమున

(1114) నారిసారింపగ ♦ వైపుణి దోప
శ్రీ రఘురాముడు ♦ జేకొనువేళ

(1115) తొలగి మాయలమారి ♦ దుష్టాసురుండు
మలగిపోయెను ప్రాణ ♦ మాత్రుడై పురికి

(1116) రాఘువు డావిల్లు ♦ రహి బాహుశక్తి
లాఘువమ్మునబట్టి ♦ లాగినయంత

(1117) తాళఁగ లేకటుల్ ♦ దశదిశల్ వణఁక
గూలెత్తుత్తునియత్తె ♦ ఘోషంబు బొదల

(1118) గడగడ భూస్థలి ♦ కంపింప దొడఁగ
నడ రేర్పడియె బ్రాణు ♦ లందరిలోన

(1119) నట్టి మంగళ లగ్న ♦ మందున దివిజు
లట్టహాసముగ జ ♦ యధ్వనుల్ నిగుడ

(1120) సుమవర్షములు రాల్చి ♦ స్తోత్రంబు సెలమి
ప్రముదంబుతో జేసి ♦ ప్రార్థించి రపుడు

(1121) జయజయ ధ్వనులతో ♦ జనకరాజాత
భయభక్తులను నర్ఘ్య ♦ పాద్యంబులిచ్చి

(1122) కుశిక ప్రసూతిని ♦ కౌమరోప్ప బొగడి
శిశుదశ సౌమిత్రి ♦ చికురముల్ బుణికి

(1123) శ్రీరామవిభు సను ♦ ర్గ్ఱించి మోదమున
గౌరవంబున సభా ♦ గ్రంబున నిల్పి

(1124) సీతావధూటిని ♦ చెలులతో బిలచి
ప్రీతి పూదండలు ♦ ప్రియ హారములను

(1125) ప్రేమపూర్వముగ స ♦ ర్పింపగ బంచి
కోమలిహస్తాగ్ర ♦ కోష్ట మందించి

(1126) రాముని జానకి ♦ రాము డటంచు
భూమిజతో గూర్చి ♦ భూమ లర్పించి

(1127) విధి విధానంబుగ ♦ పెండ్లి గావింప
బుధ సంఘమెల్ల న ♦ బ్బురముతో జూడ

(1128) జనకుడు గాధేయు ♦ సన్నిధి జేరి
తనసోదరాత్మజా ♦ తలను మువ్వురను

(1129) సౌమిత్రి భరతులు ♦ శత్రుఘ్ను డధిక
ప్రేమాభిరాము ల ♦ ర్పింతును పెండ్లి

(1130) తామనుగ్రహమున ♦ దనరింపు డనిన
సౌమనస్యంబున ♦ సంయమి మౌళి

(1131) దశరథేశ్వరునకు ♦ దరలి రమ్మనుచు
విశదంబుగా వ్రాసె ♦ పెండిలి లేఖ

(1132) జనకమహారాజ ♦ సందేశ మిదని
ఘనపద్ధతిగ వ్రాయ ♦ గా బూనె నిటుల

(1133) రాజ? నీసుతుడు శ్రీ ♦ రామ విభుండు
సాజంబుగా శివ ♦ చాపంబు నెత్తి

(1134) జనకమంటపమున ♦ జానకిఁ గొనియె
వినయధనుండయి ♦ వీర్యశుల్కముగ

(1135) శ్రీరామునకు జాన ♦ కీరామ నిచ్చి
గారవంబున బెండ్లి ♦ గావింపవలయు

(1136) లీల సోదరుల బా ♦ లికలున్నవారు
మాండవి, శ్రుతకీర్తి ♦ మఱి యూర్మిళనగ

(1137) మాండవి భరత కు ♦ మారున కిచ్చి
లాలించి యూర్మిళ ♦ లక్ష్మణుకిచ్చి

(1138) శ్రుతకీర్తికన్య శ ♦ త్రుఘ్నున కొసగి
ధృతి వివాహము నిర్ధ ♦ రించి యున్నారు

(2039) సతులతో హితులతో ♦ సచివులతోడ
దత బంధువుఃతోడ ♦ దశరథాధీశ

(1140) దయచేసి కన్యాప్ర ♦ దాన కార్యంబు
రయమొప్పసాగింప బ్రార్థించినాడ

(1141) తమపురోహితు నరుం ♦ ధతివిభుతోడ
సుముహూర్తమునకు వ ♦ చ్చుటకు ననుజ్ఞ

(2242) మిథిలానాథుండ ♦ మీవియ్యమంద
బుధనుత మదిని యు ♦ ప్పొంగుచున్నాడ

(2243) అని వ్రాసి మంగళ ♦ హార్షచిహ్నముల
పనిగొని కుంకుమ ♦ పసపున నలది

(1144) పంపిన నదిజూచి పంక్తిరథుండు
సంప్రతించి వశిష్ఠ ♦ సచివులతోడ

(1145) సానందపారవ ♦ శ్యంబున మునిగె
మానినులును దాను ♦ మహితబంధువులు

(1146) దాసదాసీజన ♦ తండంబుతోడ
భూసురాశీర్వాద ♦ పుణ్యాలగ్నమున

(1147) పురములంకారించి ♦ భూపతి తనకు
వరసుతద్వయమైన ♦ భరత శత్రుఘ్న

(1148) మణులను బెండ్లికు ♦ మారుల జేసి
ఘనదేవతాపూజ ♦ గావించి లేచి

(1149) మంగళవాద్య సం ♦ పద స్వస్తివచన
సంగతి పయనమై ♦ సాకేతపతియు

(1150) నల యరుంధతి వశి ♦ ష్ఠాది మండలము
లలితబాంధవ్య వి ♦ లక్షణ మంత్రి

(1151) భటకదంబముగొల్వ ♦ బహు పరాకనుచు
పటునాదముల శుభ ♦ ప్రభలలరింప

(1152) జనకరాజేంద్రుని ♦ సదనంబు జేర
జనపాలుడంతట ♦ స్వాగతమిచ్చి

(1153) పన్నీట నలికి శు ♦ భ్ర జ్యోత్స్న తెల్ల
వన్నియౌ నిడుచున్న ♦ వరసౌధమందు

(1154) విడిదిగావించె ను ♦ ర్వీశ నందనుల
జడదారియైన వి ♦ శ్వామిత్రు డచట

(1155) జేరి క్షేమములు వ ♦ చించుచు నుండ
నారామలక్ష్మణా ♦ త్యద్భుత ప్రతిభ

(1156) లూఁకొంచు దలిదండ్రు ♦ లుచితపద్ధతుల
బైకొని దీవించి ♦ పరితృప్తినుండ

(1157) నంతలో మిథిలేశు ♦ డా పట్టణంబు
వింత శృంగారింప ♦ వేడుక బంప

(1158) రచ్చలు సౌధముల్ ♦ రాజమార్గములు
పచ్చి తోరణముల ♦ పంక్తులుదీర్చి

(1159) పన్నీటికాల్వల ♦ భ్రమునకుజిమ్ము
క్రొన్నీటి యంత్రముల్ ♦ కుదురుగ జేర్చి

(1160) ప్రకట విద్యుద్దీప ♦ పంక్తులతోడ
నికట రక్షకభట ♦ నివహంబుతోడ

(1161) పైలుదీర్చిన రంగ ♦ వల్లులతోడ
చాలదీర్చిన సభా ♦ స్థలులతోగూడ

(1162) కదళికా ఖర్జూర ♦ ఘననారికేళ
సదమలస్తంభ ప్రవ ♦ జంబాల తోడ

(1163) మణికుడ్య దర్పణా ♦ మంద సుస్నిగ్ధ
ఘనచిత్రచిత్రికా ♦ గణములతోడ

(1164) శ్రీరామజననాది ♦ చిత్ర విచిత్ర
సారస్యకథలెల్ల ♦ జనులకు దెలియ

(1165) గోడలమీఁద రం ♦ గుల కుంచె లద్ది
వేడుకజూడ్కుల ♦ వింతదళ్కొత్త

(1166) తాటకవధ యజ్ఞ ♦ ధామ సంరక్ష
పాటించి కొనగోటి ♦ పాంసువు రాల్చి

(1167) కటికి రాతి నహల్య ♦ గా జేసినట్టి
స్ఫుటశాపమోక్షణ ♦ సువ్రతదీక్ష

(1168) శివధనుస్త్రుటన ని ♦ స్సీమ బాహాగ్ర
నవపరాక్రమములు ♦ నైపుణి దోప

(1169) వివిధ చిత్రములుగా వెలయించి రూపు
కవి వర్ణనీయ రం ♦ గముల చిత్రించి

(1170) పరిజను లిదె సిద్ధ ♦ పరచితి మనిన
తరుణీమణుల్ వస్తు ♦ తతి నిరూపించి

(1171) పరిణయ వేదిపై ♦ పంక్తులు దీర్చి
వరుసగా కల్యాణ ♦ వస్తువుల్ జేర్చి

(1172) సుమ ఫల తాంబూల ♦ శోభితసూత్ర
సముదయం బక్షతల్ ♦ సద్గంధతతులు

(1163) పళ్లెరంబులనుంచి ♦ పన్నీటిబుడ్లు
నెల్ల ధూపద్రవ్య ♦ మెసగు పాత్రములు

(1174) కాంచన నవరత్న ♦ ఘనభూషణములు
నించిన పేటికల్ ♦ నీటుగ దీర్చి

(1175) చీని చీనాంబర ♦ శ్రేణు లమర్చి
జానొప్పుపాత్రలా ♦ చక్కఁగ గదించి

(1176) కల్యాణమంటపా ♦ గ్రము ప్రసాదించి
తాళ్యేక్షణాలు మంగ ♦ ళ ధ్వను లెసగ

(1177) నృపతి దంపతులను ♦ ప్రియ పుత్రికలను
నపురూపముగ నప్పు ♦ డభ్యంజనముల

(1178) తానమాడించి విం ♦ తగ దడులొత్తి
యానని మేల్నిల్వు ♦ టద్దాల యెదుట

(1179) దివ్యాంబరములు సం ♦ దీప్త భూషణము
లవ్యయపద్ధతి ♦ నలరించి వేగ

(1180) పరిణయ శృంగార ♦ భాసురమైన
పరమకల్యాణుల ♦ పరిమళగంధ

(1181) మలది సుమంబుల ♦ నందందజుట్టి
తిలకంబు కస్తురి ♦ దీరిచిపెట్టి

(1182) వలెవాటును ముసుంగు ♦ వస్త్రంబుగట్టి
యలివేణులను చెలుల్ ♦ హస్తముల్ బట్టి

(1183) మంగళ కల్యాణ ♦ మంటప వేది
నంగనామణులు క ♦ ల్యాణముల్ బాడ

(1184) తల్లిదండ్రులమధ్య ♦ దగు పీఠి నుంచ
వల్లభుల్ దశరథ ♦ వల్లభ సతుల

(1185) నడుమ పీఠంబుల ♦ నాణ్యంబు దోప
గడు చిత్రముగనుండి ♦ కనుచున్న వేళ

(1186) నల వశిష్ఠుం డహ ♦ ల్యా నందనుండు
నలలితానుజ్ఞ మహ ♦ జనసభను

(1187) దయతోడ వేడి భూ ♦ దయితులు తాము
రయమున పుణ్యాహ ♦ రంగ మేర్పఱచి

(1188) స్నాతకదీక్ష ర ♦ క్షా బంధనములు
నాతత మధుపర్క ♦ యజ్ఞోపవీత

(1189) ధారణల్ మంత్రతం ♦ త్రములెల్ల నెఱపి
సార కన్యాదాన ♦ సమయంబు దెలుప

(1190) శ్రీరామునకు సీత ♦ చేయి యందించి
కూరిమి నిటు జన ♦ కుండు వచించె

(1191) ఈసీత నాసుత ♦ యెల్లెడలందు
నీసహచారిణి ♦ నిఖిల ధర్మముల

(1192) ప్రేమ నీకొరకు న ♦ ర్పించుచున్నాడ
రాము? సత్పూరుషా ♦ ర్థముల బాలించు

(1193) మనవుడు భరతున ♦ కల్ల మాండవిని
ఘనత సౌమిత్రికి ♦ కన్య నూర్మిళను

(1194) శ్రుతకీర్తి నటులె ♦ శత్రుఘ్నున కొసగి
హితబోధ దత్పిత ♦ లెఱిగింపుచుండ

(1195) మంగళాష్టకములు నుఱి చూర్ణికలును
సంగతితో మహా ♦ సంకల్పములను

(1196) నెఱవేర్చి తలబ్రాలు ♦ నీటుగబోయ
పరమ నారాయణ ♦ వరగుణరూప

(1197) దురితాపహారణ దు ♦ ర్దోషాటదమన
చరితార్థమయ్యెనా ♦ జన్మ మటంచు

(1198) గురుభక్తి రాము ప్ర ♦ కోష్ఠంబుబట్టి
కరుణారసంబులు ♦ కన్నుల దొలుక

(1199) కనక సంపన్న నీ ♦ కన్యాతిధన్య
ననుపమ సౌజన్య ♦ నఖిలాగ్రగణ్య

(1200) ననురూప యౌవన ♦ నర్పించినాడ
నను ధన్యజేసి కన్య ♦ ననుగ్రహింపు

(1201) నారాయణుడవీవ ♦ నాదియా లక్ష్మి
ఈ భామ రామ? నా ♦ కేటి కొరంత

(1202) అన శతానంద మ ♦ హర్షి వసిష్ఠ
ఘన పరాశరముని ♦ కాండమా సాను

(1203) ధ్రువము ధ్రువమ్మని ♦ ధ్రువ మంత్రములన
వివిధాశిషంబుల ♦ వెలయింపుచుండ

(1204) సతి యరుంధతి ముని ♦ సతులతో గూడి
ప్రతిలేని మేటి నీ ♦ రాజనం బాసగ

(1205) వారాంగనలు నాట ♦ పాటలగొల్వ
పేరటాండ్రటు వచ్చి ♦ పేరులం చదుగ

(1206) భాషికంబులతోడ ♦ బసుపు వస్త్రముల
వేషంబుతోనుడు ♦ వీధిన ధ్రువుని

(1207) రూపించి సాంగంబు ♦ మూఢి కెక్కించి
శాపాయుధుల బుధ ♦ జనులను జేరి

(1208) ఫల సుమ తాంబూల ♦ బహుల దక్షిణల
తులలేని దానముల్ ♦ దొలుకాడ నొసగి

(1209) సామంతరాజు ల ♦ సత్కృతు లంది
ప్రేమకట్నంబులు ♦ ప్రీతి నర్పించి

(1210) పౌరసువాసినీ ♦ పంక్తుల కెల్ల
కూరిమి పసుపు కుం ♦ కుమ గంధ మలది

(1211) తాంబూలములు పండ్లు ♦ తగు పుష్పమాలి
కాంబరంబు లొసంగి ♦ యాశీస్సు లంది

(1212) శాకపాకాన్న ర ♦ సాయనరుచుల
నేకాధ్వరంబుగ ♦ నెల్లభక్ష్యముల

(1213) వరమధురాహార ♦ పక్వాన్నములను
సరణిదప్పక భూత ♦ సంతృప్తి జేసి

(1214) బువ్వముబంతుల ♦ పూబోండ్లు జేరి
మవ్వంపు పాటలు ♦ మఱిమఱి పాడ

(1215) పరిపూర్తి జేసి సం ♦ బరమున బొదలి
వర పట్టణోత్సవ ♦ వైభవశ్రీల

(1216) నిరుపమానానంద ♦ నిర్భరు లగుచు
జరిపిరి క్షత్రియా ♦ చారంబు కలిమి

[ సాకేత ప్రయాణము ]



(1217) వరప్రయాణ మొనర్ప ♦ వలెనని యడుగ
స్థిరభక్తి దశరథ ♦ క్షితిపతితోడ

(1218) జనకభూపతి తథా ♦ స్తని ప్రయాణించి
ఘన భూషణాంబర ♦ కనక చిరత్న

(1219) మణిహార వల్లరుల్ ♦ మానినీశతము
ననుపమాన ప్రేమ ♦ నర్పించి మంచి

(1220) దాసీజనమునిచ్చి ♦ తత రథ తురగ
శ్రీసమంచిత గంధ ♦ సింధుర సుభట

(1221) చతురంగబలముల ♦ సాగించి మంచి
ప్రతిలేని బొమ్మలు ♦ వస్తువులిచ్చి

(1222) అల్లుండ్ర కూతుల ♦ నందఱ నుచిత
సల్లాపముల దేర్చి ♦ జనపాలు జూచి

(1223) దశరథరాజ! స ♦ త్యవ్రతాచార
విశదేందుముఖ నాదు ♦ బిడ్డ యీసీత

(1224) తమకోడలై రాము ♦ దాస్యంబు జేయ
సమకూరు మా జన్మ ♦ సాఫల్య మనుచు

(1225) వియ్యమాసించితి ♦ వేవేలయేండ్ల
నెయ్యంపుపంట త ♦ న్నిపుడె కటాక్షింపు

(1226) ఈబిడ్డ మీబిడ్డ ♦ యికమీద రాజ!
మాబిడ్డయనుమాట ♦ మరపింపవలయు

(1227) రామ? నాకూర్మి గా ♦ రాబంపు తనయ
ప్రేమ నీరీతి న ♦ ర్పించుచున్నాడ

(1228) మారాడ నెరుగదీ ♦ మంజులవాణి
యేరీతి నెనరున ♦ నేలంగ గలవా?

(1229) కనుసన్న దాసికా ♦ గణములలోన
పనులందుకొనుచున్న ♦ బంగారుబొమ్మ

(1230) ఎక్కడేమవసర ♦ మెఱుగగలేదు
గొప్పవారలసేవ ♦ కూడ క్రొంగ్రొత్త

(1231) చిత్తమర్పించి మా ♦ సీతమ్మ హృదయ
వృత్తులనేకీభ ♦ వింప గదయ్య

(1232) క్షీరనీరన్యాయ ♦ సిద్ధి చేకూర
వీరమాతృత గూర్చి ♦ వెలుగొందుమయ్య

(1233) సిగపూవువాడ కీ ♦ సీతాంబుజాక్షి
తగ వుద్ధరించునని ♦ దవిలి శ్రీరామ

(1234) అనుచు కూతుండ్ర వా ♦ రల్లుండ్రగూర్చి
వనితలలోన నీ ♦ వరుసన జనను

(1235) లొప్పగింతలపాట ♦ లోనరంగబాడ
జెప్పలేకను జెప్పు ♦ స్త్రీమోపదేశ

(1236) మఃలు విని కన్నీళ్లు ♦ మున్నీళ్లుగాగ
బలు దుర్భరంబుగ ♦ బాలికలగల

(1237) దల్లులల్లనకేల ♦ దనయుల నెత్తి
తల్లులారా! ఇది ♦ తప్పగుసుమ్మ

(1238) మల్లివత్తుము మేము ♦ మాత్రమురామ
వల్లభుడే చతు ♦ ర్వర్గ సాధనము

(1239) వచ్చుచు బోవుచు ♦ వలయు ధర్మములు
విచ్చలవిడి నెర ♦ వేర్పగవలయు

(1240 మహనీయులమ్మ మీ ♦ మామగారనిన
నహహా? కృపాశీల? ♦ అత్తగారనిన

(1241) మొగడు లోకాలోక ♦ మోహనమూర్తి
తగ వెంచి పాలించు ♦ ధన్యవీవమ్మ

(1242) చక్కెరబొమ్మని ♦ సహజశీలమున
మక్కువకులమెల్ల ♦ మంచిపేరందు

(1243) తల్లినీసంతాన ♦ తతి లోకములకు
నుల్లాస మొదవించు ♦ నుర్వినటంచు

(1244) చెలికత్తియలగూర్చి ♦ స్నేహంబు బెంచి
తలకందరకు బాపి ♦ ధైర్యంబుగూర్చి

1245 యుచిత వాహనముల ♦ నొయ్యననెక్కి
యచిరమే పయనమై ♦ యందరుగూడ

(1246) జయజయ ధ్వనులతో ♦ జనకుపురంబు
ప్రియజనంబులుగొల్వ ♦ రయమున విడచి

(1247) సాకేతగమనంబు ♦ సల్పుచునుండ
వీకతో భృగుజుండు ♦ వేంచేసి తనదు

(1248) ధనువిడి పరమాత్మ ♦ తారకబ్రహ్మ
మని రఘురాముని ♦ యాత్మలోనెరిగి

(1249) పొగడి కర్తవ్యాంశ ♦ మును ఘోషపరచి
తగవెంచి యనుమతి తపమున కరిగె

(1250) నంత సాకేతంబు ♦ నందునజేరి
సంతోష మిగురొత్త ♦ సామంత నృపతి

(1251) హితసుత వితతితో ♦ నింతులతోడ
కుతకమ్మొనగు ముద్దు ♦ కోడండ్రతోడ

(1252) వియ్యాంపువారితో ♦ విబుధ వర్గముల
నెయ్యంబుతోఁగణ ♦ నీయులతోడ

(1253) నిక వశిష్ఠాదిము ♦ నీంద్రులతోడ
సకల శిష్టాచార ♦ సంతతితోడ

(1254) విజయవాద్య గృహాగ్ర ♦ వేశంబు సల్పె
నజహారాదులుఁగూడ ♦ నాశ్చర్యపడగ

(1255) సురదుందుభులు మ్రోసె ♦ సుమవృష్టిఁగురిసె
ధరరామమూర్తి సీ ♦ తా పతియనుచు

(1256) నారదాది మహర్షి ♦ నాథులువీణ
లారూఢిదాల్చి ♦ యాడుచుపాడి

(1257) గానంబొనర్చి ర ♦ క్కజ మిలదోప
నానందపార వ ♦ శ్యము దలజూప

(1258) మర్లపెండ్లి యొనర్చి ♦ మఱి యథావిధిగ
తర్లించి మైధిలు ♦ దశరథేశ్వరుడు

(1259) కొడుకులు కోడండ్లు ♦ గురుబంధుజనులు
తడయక కొల్వంగ ♦ ధరణి బాలించె

(1260) యువరాజ్యపదమున ♦ నున్న శ్రీరాము
దవిలి వర్తించె సీ ♦ తామహాసాధ్వి

(1261) అనుజులు ప్రజలు దా ♦ సాను దాసులుగ
వినయంబుగొన రామ ♦ విభు డుర్వి యేలె

(1262) తరియని తనముద్దు ♦ తనయులరాజు
పురిమహోత్సవము ల ♦ పూర్వపద్ధతిగ

(1263) పట్టపేన్గులపైన ♦ వర వధూమణుల
బట్టి యెక్కించి శు ♦ భధ్వనుల్ సెలగ

(1264) జనకభూమీశుండు ♦ సామంతనృపతులు
మునికోటి బాంధవ ♦ ముఖ్యులు భటులు

(1265) హితపురోహితులు ♦ మహీయ సైనికులు
నతులపుణ్యాంగన ♦ లాటకత్తియలు

(1266) వందిమాగధులు ది ♦ వ్యముగ కీర్తింప
దింధిమి నాట్యముల్ ♦ దెసలు ఘూర్ణిల్ల

(1267) తారుచువ్వలువుట్లు ♦ చందన ధ్వనుల
సారించు బిరుసులు ♦ చదలంటిచిట్ల

(1268) రంగురంగుల ధరా ♦ రమణి యనర్ఘ
సంగతహారమా ♦ సామెతజూపు

(1269) మేలిమి చువ్వల ♦ మేను శబ్దముల
ప్రేలుచు వెరపిచ్చు ♦ పెట్లదిమ్మియలు

(1270) కగలు వత్తు లనేక ♦ వైభవంబెసగ
నగరోత్సవంబు సా ♦ నా డొనరించి

(1271) మగటిమి కల్యాణ ♦ మంటపాగ్రమున
దగు పీఠి నుంచి సీ ♦ తారామచంద్రు

(1272) లను మునిగణముల ♦ ల్లనజూచియిట్లు
వినుతింప దొడగిరి ♦ విస్మయంబొదవ

(1273) జయ జానకీరామ? ♦ సంగ్రామభీమ
జయ రాక్షసవిరామ? ♦ సౌజన్యకామ

(1274) నిమి రవి వంశముల్ ♦ నీ ప్రాపుగాంచె
క్షమనుద్ధరింతువు ♦ సాకేతవాస

(1275) వంశంబులివియేల ♦ బ్రహ్మాండమెల్ల
సంశయింపక రక్ష ♦ సల్పవచ్చితివి

(1276) సాకేతరామ? ♦ శ్రీజానకీరామ?
లోకేశరామ? త్రి ♦ లోకాభిరామ?

(1277) పరమకరుణారామ? ♦ పట్టాభిరామ?
చిరయశోద్దామ మో ♦ శ్రీరఘురామ

(1287) పుణ్యచరిత్రమై ♦ పొసగించి జనుల
ధన్యతందగ జేయు ♦ దలచినయంత

(1287) పఠన పారాయణా ♦ భ్యాసాది విధుల
శఠవృత్తి నణచి భూ ♦ జనుల రక్షించు

(1288) నీకథజదివిన ♦ నెవ్వారు వినిన
కాకుత్స్థు డేవేళ ♦ కరుణ బాలించు

(1289) ఆపదలడగు సౌ ♦ ఖ్యంబులు గలుగు
శ్రీపతిదయ ఫల ♦ సిద్ధి చేకూరు

(1290) పాపశోషణము సం ♦ పదపెంపుగాంచు
బ్రాపించు సంతతి ♦ భాగ్యంబులొదవు

ఇది శ్రీమనుమారమణీ రమణీయ కృపాకటాక్షాను
లబ్ధ సరసోభయ భాషాసాహితీ వివిధావధాన
బహుప్రబంధరచనాధురంధర గద్వాలాస్థాన
కవి. గాడేపల్లి వీరరాఘవశాస్త్రి
శతావధాని ప్రణీతంబైన
శ్రీరాణీసత్యా, వరలక్ష్మీ
రామాయణంబను
ద్విపద కావ్యంబున
సీతా కల్యాణము
సంపూర్ణము.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు | పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 16 | 13 | లాసు | ల్లాసు | 77 | 9 | మొని | మోని |
| 17 | 11 | జాగ | జ్జాగ | 79 | 6 | రాంగి | ర్శాగి |
| 17 | 18 | రూ | రూప | 80 | 6 | విహార | విహార |
| 19 | 5 | మిటు | ఏట్లు | 81 | 5 | ంశాఖల | శాఖల |
| 28 | 11 | రాను | రాము | 83 | 5 | డసగ | డఃగ |
| 29 | 2 | జొప్ప | బొప్ప | ... | 13 | గన్య | గవ్య |
| 41 | 3 | గలలు | గసలు | 87 | 8 | ముఖ | ముఖి |
| 43 | 17 | మ·ఫ | మున | 92 | 18 | లాలారు | లారు |
| 45 | 12 | రామూ | రావమూ | 93 | 6 | దోప | జోప |
| 46 | 16 | మండ | నండ | 94 | 10 | బడ | బద |
| 54 | 7 | దాల్వ్రి | దాల్బి | ... | 12 | పాకేత | సాంకేత |
| 59 | 7 | మ్మచు | మ్మనుచు | 95 | 9 | దుండ | దుండె |
| 59 | 10 | మూని | నూని | ... | 15 | వాసవ | వాస్తవ |
| 60 | 14 | జన | జైన | 97 | 14 | చుకు | చుటకు |
| 61 | 16 | భారునై | బారుతై | 98 | 7 | క్షించె | కించె |
| 63 | 8 | నెఱెంగి | నెఱెంగె | 103 | 6 | వలా | పలా |
| 65 | 14 | నీయని | నియ్యని | 105 | 8 | వెవరో | వెవరొ |
| ... | — ... | జృంబ | జృంభ | 106 | 6 | స్త్రీల | స్త్రీల |
| 72 | 9 | గాక | గానక | 111 | 6 | హాస్తు | హాస్త |
| 73 | 1 | లూర్బ | లూర్భ | 113 | 11 | హారిణి | హారిణి |
| ... | 4 | మిత | మింత | 114 | 10 | నిటులు | నిట్టులు |
| 74 | 2 | రమ్మ్మని | రమ్మని | ... | 18 | మాద | మాన |
| ... | 7 | నీచాత | నీచాతి | 115 | 18 | డంము | డము |
| 75 | 6 | గొసిన | గొవని | 116 | 9 | పలుకు | పలుకు |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 117 | 7 | సప్రుము | సప్పము |
| ... | 10 | వారు | వాడు |
| 118 | 9 | డంబున | డమున |
| ... | 11 | ద్బుత | ద్భుత |
| ... | 12 | ధనుపు | ధనువు |
| 120 | 12 | బోపృదో | బోప్రదో |
| ... | 15 | దాదాక | దాక |
| ... | 17 |  | ై |
| 121 | 8 | యట్టి | యెట్టి |
| ... | 11 | మెక్కు | మంమండి |
| 122 | 9 | ప్రీత | ప్రీతి |
| 123 | 2 | జంకయ్యా | జంకయ్యె |
| ... — ... |  | సిధి | నిది |
| ... | 6 | నాయుడ | నాయెడ |
| ... —— |  | డరి | డది |
| ... | 8 | సాయి | స్థాయి |
| 124 | 15 | పేరు | పదు |
| ... | 16 | వసిచె | వసించె |
| 125 | 7 | కన్నెతి | కన్నెత్రి |
| 126 | 2 | ముద్లులు | ముద్దులు |
| ... | 3 | లాడి | లాడి |
| ... | 4 | లోంచి | లోకించి |
| ... | 4 | యుదేసై | యుదేమె |
| ... | 10 | ప్రథమ | ప్రమథ |
| ... ... |  | ఘుముల | ఘుమ్ముల |
| ... | 12 | మునర | ముందర |
| 127 | 3 | యోజుచు | రోజుచు |
| ... | 6 | మొందు | డొందు |
| ... | 9 | పాపృష్టి | పాపిష్టి |
| .. | 13 | డనుచు | డంచు |
| . . | 14 | మాగేల | మీదేల |
| — | 15 | నేల | దేల |
| ... | 18 | గొజ్జన | గొబ్బున |
| 128 | 3 | పలె | వలె |
| ... | 8 | హొలతో | టులతో |
| ... | 11 | గాధ | గాథ |
| 129 | 8 | ప్రారించి | ప్రార్థించి |
| 31 | 7 | కీర్ర | కీర్తి |
| ... | 12 | బ్రార్థం | బ్రార్థి |
| 133 | 12 | పచ్చి | పచ్చ |
| 136 | 14 | నానుజ్ఞ | త్తాజ్ఞను |
| ... — ... |  | సభను | సభ నెల్ల |
| 138 | 5 | యూవన | యౌవన |